ఓమ్

# ఈశావాస్యోపనిషత్తు

(శ్రీ మద్దయానంద మహర్షి భాష్యోపేతము)



ఆంధ్రానువాదము :

పండిత గోపదేవ్



ప్రకాశకులు :

ఆర్య సమాజము - కూచిపూడి

అంబా దర్శన గ్రంథమాల - ౧౩
చతుర్థి - ౪౦౦౦

సర్వస్వామ్యములు : ఆర్య సమాజము - కూచిపూడి.

ప్రతులకు :
ఆర్యసమాజము
కూచిపూడి, తెనాలి తాలూకా
గుంటూరు జిల్లా.

మాశెట్టి వేంకటేశ్వరరావు,
3-3-738, కంచరి బజార్,
సికింద్రాబాద్ - 500 003

మే 1990

మూల్యము :
రూ. 4-50

Offset Printing
SRISHMA IMPRESSIONS
Secunderbad. Phone : 834185

# అంబా దర్శన గ్రంథమాల

మహారాజపోషకులు :- రు. ౩౦౦౦లు అంతకుపైన నిచ్చువారు

రాజపోషకులు :- రు. ౧౫౦౦లు ” ”

పోషకులు :- రు. ౫౦౦లు ” ”

మహారాజపోషకులు :

౧ శ్రీమతి కొత్తపల్లి యామినీదేవి కూచిపూడి
౨ శ్రీ బెల్దె జగదీశ్వరయ్య శ్రేష్ఠి సికిందరాబాద్
౩ శ్రీ మాశెట్టి వేంకటేశ్వరరావు సికిందరాబాద్
౪ శ్రీ కొసరాజు మాధవయ్య తెనాలి
౫ డా. శ్రీ వై. వి. సుబ్బారావు, సరోజినీదేవి గుంటూరు
౬ శ్రీ గ్రంధి కామరాజు విజయవాడ
౭ శ్రీ కావూరి జయచంద్రవర్మ కూచిపూడి
౮ శ్రీ చదలవాడ అచ్చేశ్వరరావు: రాజ్యలక్ష్మి ”
౯ శ్రీమతి చదలవాడ లక్ష్మమ్మ ”
౧౦ శ్రీ మజ్జిడ్డి గురవారెడ్డి తూములూరు
౧౧ శ్రీ చంద్రయ్య & సన్సు—అల్ వాల సికిందరాబాద్
౧౨ శ్రీ యం. యస్. బాలకృష్ణ, సుధాకర్ ”
౧౩ శ్రీ ఉప్పల రాజేశ్వరరావు ”
౧౪ శ్రీ కొసరాజు తిరుమలరావు, సూర్యకుమారి కురుమద్దాలి
౧౫ శ్రీ గజ్జె సుబ్బారావుగుప్త, నాంచారమ్మ గుంటూరు
౧౬ శ్రీ జక్కిడి సీతారామరెడ్డి, సీతాఫలమండిసికిందరాబాద్
౧౭ శ్రీ తుమ్మల వల్లభయ్య కూచిపూడి
౧౮ శ్రీ నోముల స్వామిదాస్, శ్రీ శ్రీపతి వెంకటరావు సికిందరాబాద్
౧౯ శ్రీ వాసంశెట్టి రామకృష్ణారావు వలసపాకల
౨౦ శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ గుంటూరు

రాజపోషకులు :-

౧ శ్రీ కావూరి సంగయ్య కూచిపూడి

౨ శ్రీ జె. వెంకటరావు వరంగల్

౩ శ్రీ బి. శంకరలాల్ హైదరాబాద్

౪ శ్రీ యలవర్తి రామకోటయ్య, సీతారత్నం కూచిపూడి

౫ శ్రీ కుమ్మరి పోచయ్య సికిందరాబాద్

౬ శ్రీమతి బొర్రా వేంకటరత్నమ్మ కూచిపూడి

౭ శ్రీ యం భూపతిరావు ప్రజ్ఞాపురం హైదరాబాద్

౮ శ్రీ సరిదె శ్రీనివాసరావు, కనకలక్ష్మి రేలంగి గోదావరి

౯ శ్రీ వి. యస్. గుప్త కొత్తగూడెం

పోషకులు :-

౧ శ్రీ మేకా రామకృష్ణయ్య కూచిపూడి

౨ శ్రీ జాస్తి వెంకటప్పయ్య, తులశమ్మ ,,

౩ శ్రీమతి దాసరి రామకోటమ్మ ,,

౪ శ్రీమతి కన్నెగంటి శైలసుత నవరత్నకుమారి ,,

౫ శ్రీ కోట్ల రమణారెడ్డి సికిందరాబాద్

౬ శ్రీ పోలం వీరయ్య సోదరులు ,,

౭ శ్రీ కోడూరి సుబ్బారావు, సీతాఫలమండి ,,

౮ శ్రీ దుర్గాసత్యనారాయణ, కృష్ణవేణి తణుకు

౯ శ్రీ కావూరి శివరామయ్య మోపిదేవి

౧౦ శ్రీ గడ్డిపాటి వేంకట కృష్ణయ్య అమృతలూరు

౧౧ శ్రీ చుండూరి శ్రీహరిరావు, శాంతకుమారి గుంటూరు

౧౨ శ్రీమల్లాది సూర్యనారాయణమూర్తి రాజంపేట(తూ॥గో॥జి)

# అంబాదర్శన గ్రంథమాల

అర్య సమాజము - కూచిపూడి - 522 313

గ్రంథముల వివరము

1. సత్యార్థప్రకాశము
2. వేదతత్త్వ ప్రకాశము (ఋగ్వేదాది భాష్యభూమిక)
3. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము 1-భాగము
4. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము 2-భాగము
5. దయానంద ఋగ్వేద భాష్యభాస్కరము 3-భాగము
6. శ్రీమద్భగవద్గీత
7. శ్రీ స్వామి దయానంద సరస్వతి జీవిత చరిత్ర
8. అర్థధర్మ మీమాంస
9. డా. వం. గోపదేవ్ ఆత్మచరిత్ర
10. గురువు విరజానంద జీవితచరిత్ర
11. ఈశావాస్యోపనిషత్తు
12. కేనోపనిషత్తు
13. కఠోపనిషత్తు
14. ప్రశ్నోపనిషత్తు
15. ముండకోపనిషత్తు
16. మాండూక్యోపనిషత్తు
17. తైత్తిరీయోపనిషత్తు
18. ఐతరేయోపనిషత్తు
19. శ్వేతాశ్వతరోపనిషత్తు
20. ఛాందోగ్యోపనిషత్తు
21. బృహదారణ్యకోపనిషత్తు
22. న్యాయదర్శనము
23. వైశేషికదర్శనము
24. సాంఖ్యదర్శనము
25. యోగదర్శనము
26. వేదాంతదర్శనము (వ్యాసకృత బ్రహ్మ సూత్రములు)
27. ఆస్తికవాదము

28. ఆర్యాభివినయము
29. ఆర్యగృహిణి
30. సంస్కారవిధి
31. ఈశావాస్యోపన్యాసములు
32. పూజ
33. వైదికదినచర్య
34. వైదికవినతి (స్వాధ్యాయమంజరి) 1-భాగము
35. వైదికవినతి (స్వాధ్యాయమంజరి) 2-భాగము
36. ఏసుక్రీస్తు రహస్యజీవనము
37. వ్యవహార భానువు
38. బ్రాహ్మణగోవు (గవిసూక్తము)
39. మాతృభూమి స్వరాజ్యము (పృథ్వీసూక్తము)
40. ఆర్యావర్తవాణి
41. ఆర్యసమాజమననేమి ?
42. ఈశ్వరుడు ప్రత్యక్షసిద్ధమా ?
43. అపశూద్రాధి కరణము
44. వైదిక త్రైతవాదము
45. ఈశ్వర స్వరూపము
46. వైదిక వర్ణవ్యవస్థ
47. వేదమే యీశ్వరీయము (బైబిలు - ఖురానులు కావు)
48. హేతువాది దయానంద
49. శంకరపీఠాధిపతులు - అంటరానివారు
50. అహం - నేను
51. మనము హిందువులమా ?
52. శ్రీరామనవమి - సీతాకళ్యాణము
53. గోకరుణానిధి
54. జాతీయత
55. వేదాంతి ధ్వంత నివారణము
56. భాగవత ఖండనము
57. దర్శనములు
58. లక్ష్మీసూక్తము
59. ఓమ్‌స్మర
60. ఆర్యసమాజనియమములు - ఉపనియమములు

## అనుకర్త పం.గోపదేవ్ శాస్త్రిగారి సంక్షిప్త పరిచయము

జననము : క్రీ.శ.1900 ప్రాంతము.
జననీజనకులు : శ్రీ అంబమాంబా రామయార్యులు.
స్థానము : కూచిపూడి, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.
విద్యాభ్యాసము : కాశ్యాది విద్యా పీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు.
అభిమాన విషయములు: షడ్ దర్శనములు, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గ ప్రావీణ్యము.
వృత్తి : వైదిక ధర్మ వ్యాపకత.
రచనలు అనువాదములు: అయిదు దర్శనములు, పదునొకండు ఉపనిషత్తులు, ఆస్తికవాదము, అర్థధర్మ మీమాంస, శ్రీమద్భగవద్గీత, ఋగ్వేదాది భాష్యభూమిక, సత్యార్థ ప్రకాశము, సంస్కారవిధి, ఋగ్వేద భాష్యభాస్కరము-3భాగములు మొదలైనవి 60 గ్రంథములు - మొత్తం పుటలు షుమారు 9000.

తమకు పైతృకముగా లభించిన కొన్ని వేల రూపాయలు వృద్ధి చెంది లక్షరూపాయలైనవి. వాటితో తమ జనని జనకుల పేరుతో "అంబా - రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు" స్థాపించి తెలుగులో సత్యార్థ ప్రకాశమును నిరంతరము ముద్రింపించి ప్రచురించుటకు యేర్పాటు చేసిరి. ప్రస్తుతము హైద్రాబాదులోని దయానంద ఉపదేశక విద్యాలయమునకు ఆచార్యులుగా ఉపదేశకులకు శిక్షణ నొసంగుచున్నారు.

# సంపాదకీయము

ఈశావాస్య మీశ్వరీయ మగు యజుర్వేదము లోని భాగమై స్వతఃప్రమాణ మగుచుండ కేనాద్యుపనిషత్తు లితరములు ఋషిప్రోక్తములై పరతఃప్రమాణము లగుచున్నవి.

ఉపనిషత్తుల కన్నింటికి దలమానికమై మంత్రోపనిషత్తుగ గణింపబడు నీ యీశావాస్యము నొకటి రెండు పర్యాయములు పండిత గోపదేవ్ గారి తెలుగు వ్యాఖ్యానముతో శ్రద్ధగా నధ్యయన మొనర్చినచో మంత్రములలో సామాన్య దృష్టికి స్ఫురింపని భావములు తెలుగు వ్యాఖ్యానమున గోచరించును. ఈ తెలుగు అనువాదమునకు మూలమగు శ్రీ మద్దయానంద మహర్షి సంస్కృత భాష్యమును ఒక్కొక్క మంత్రార్థము రెండు మూడు దినములు పఠించి మననము చేసినచో - ఆర్ష దృష్టితో మంత్రార్థముల వివరించుచు మహర్షి దయానంద సరస్వతి వ్రాసిన భాష్యములోని విశిష్టత యొకింత స్పష్టమగును.

"ఈశావాస్య మిదగ్ం సర్వం, సపర్యగా చ్ఛుక్ర మకాయం, సంభూతిం చ వినాశం చ" ఇత్యాది మంత్రములలో సూచితములగు వేదవాదము - జీవేశ్వర ప్రకృతుల యునికి, వాని స్వరూప స్వభావాదులు, సగుణ నిర్గుణ స్వరూపములు, పదార్థముల కార్యకారణ సంబంధము, వాని స్థితిగతులు మున్నగు విషయములను గురించి సామాన్య పాఠకులకు గూడ

నర్థమగుటకై కొంత వివరింపవలసియున్నను "అనువాద మగుటచే తెలుగు వ్యాఖ్యానము మూలానుసరణముగ నుండ వలయుననియు, వేదభాగమగు నీ యుపనిషత్తునకు మహర్షి దయానంద సరస్వతి వ్రాసిన భాష్యము ఉన్నది యున్నట్లు పాఠకలోకమున కందించుట ముఖ్య మనియు" శ్రీ గోపదేవ్ గారు మున్నుడిలో పై విషయముల వివరించుచు "త్రిత్వవాద" మను పేర వ్రాసిరి. దానితో పాటు సంస్కృత భాషాజ్ఞానముండి, మూలము చూడదలంచిన పాఠకుల కుపయోగించు నన్న దృష్టితో, శ్రీ మద్దయానంద మహర్షి భాష్యముకూడ నీ సంస్కరణములో యజుర్వేద భాష్యమునుండి తీసి చేర్చిరి. ఇట్టి విశేషములతో నీ సంస్కరణము విశిష్టమయి పాఠక మహాశయుల కందింపబడుచున్నది.

మరుగున పడియున్న వేదవిజ్ఞానమును గ్రంథ రచనల మూలమున వెలుగునకు దెచ్చుచు వైదిక ధర్మ వ్యాపకతయే వృత్తిగ బెట్టుకొని నిరంతరము ప్రచారము సల్పుచున్న శ్రీ పండిత గోపదేవ్ గారి రచనలు పఠించునెడల, వ్యక్తికల్పిత నానామత సంప్రదాయములతో గతానుగతికములగు నంధ విశ్వాసములుతొలగి వేదవాదము (వేదమతము) లోని విశిష్టత పాఠకులు గ్రహింపగలరని విశ్వసించుచున్నాను.

కడచిన వత్సరములలో నింతవఱకు బది యుపనిషత్తులు, ఐదు దర్శనములు, శ్రీమద్భగవద్గీత, అర్థధర్మమీమాంస, ఆస్తికవాదము, ఈశావాస్యోపన్యాసములు, శ్రీ స్వామి దయా

నంద సరస్వతి జీవిత చరిత్ర మొదలగు ఉద్గ్రంథములు, పూజ్య ఏసుక్రీస్తు రహస్య జీవనము, ఆర్యగృహిణి, అపశూద్రాధి కరణము, హేతువాది దయానందుడు, వేదమే ఈశ్వరీయము బైబిలు, ఖురానులు కావు, వేదాంతిధ్వాంత నివారకము మొదలైన విమర్శక గ్రంథములు మొత్తము 38 పుస్తకముల నీ గ్రంథమాల ముద్రణము పునర్ముద్రణము కావించి పాఠకుల కరకమలముల కందించినది. ఇంకను బృహదారణ్యకోపనిషత్తు, షోడశ సంస్కారము లను రెండు గ్రంథములేకాక పలుగ్రంథముల నచ్చొత్తించి పాఠకుల కందించుటకు ఈ గ్రంథమాల వారు ప్రయత్నించుచున్నారు.

ఈ అంబాదర్శన గ్రంథమాలకు పలు గ్రంథముల వ్రాసి యిచ్చియు నింకను వ్రాసి యిచ్చుచున్నట్టియు శ్రీ పండిత గోపదేవ్ గారికి శతాధికాయురారోగ్యముల నొసంగు గాతమని భగవంతుని ప్రార్థింతును.

ఈ గ్రంథమాలకు ఉత్సాహవంతుడైన శ్రీ యలవర్తి సూర్యనారాయణరావు గ్రంథాలయాధ్యక్షుడుగా లభించుటచే పుస్తక పునర్ముద్రణము మున్నగు కార్యములు చురుకుగా కొనసాగుచున్నవి. భగవంతుడు సత్కార్య కర్తలకు సాయపడుగాక !

సర్వేజనాః సుఖినో భవంతు.

ఆరమండ్ల వెంకయార్య.

# మున్నుడి

సంస్కృత భాషను వైదికము, లౌకికము నని రెండు తెఱగులుగ వ్యవహరింతురు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము,అథర్వవేదము నను నాలుగు వేదములు వైదిక భాషకు మూలములు. వీనిని సంహిత లనియు, మంత్రభాగములనియు, శ్రుతులనియు చెప్పుట కలదు. వేదము వీనికి ముఖ్యనామము. మానవులకు కావలసిన జ్ఞానమంతయు నీవేదములం దిమిడియున్నదని వేదతత్త్వవిదులు భారతీయ విద్వాంసులు నుడువుదురు. ఈ జ్ఞానము ఈశ్వరీయమనియు వారెంచుచున్నారు.

ఈ వేదములే కాక బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు నను నామములతో వ్యవహరింపబడు బహుళ సాహిత్యముకూడ వైదిక భాషకు చెందినదే. ఇందు బ్రాహ్మణములు వేదములకు వ్యాఖ్యానములు. ఆరణ్యకములు కూడ వేద తత్త్వములను బోధించుటకు తోడ్పడు గ్రంథములే. ఉపనిషత్తులు వేదములందలి యాధ్యాత్మిక తత్త్వములను బోధించుట కుపకరించు గ్రంథములు. ఇవి యన్నియు మహర్షుల కృతులు. అందువలన ఆర్షము లనబడును.

కాని, ఈ యుపనిషత్తులలో ప్రథమముగా నెంచబడు ''ఈశావాస్యోపనిషత్తు''మాత్రము యజుర్వేదములోని చివరి యధ్యాయమే యై యున్నది. అందువలన నిది మంత్రోపనిషత్తని చెప్పబడుచున్నది. యజుర్వేదమునకు వాజసనేయ సంహిత యనియు నామమున్నందున నీ యుపనిషత్తు 'వాజసనేయోపనిషత్తు'' అనియు వ్యవహరింపబడును.

''ఉపనిషత్'' అను నీ పదము ''ఉప, ని,'' అను ఉపసర్గలతో కూడిన ''సద్'' ధాతువుతో నేర్పడుచున్నది. ఈ ''సద్'' ధాతువునకు ''విశరణము, గతి, అవసాదనము'' నని మూ డర్థములు. (విశరణము=

నాశము, గతి=ప్రాప్తి, అవసాదనము = శిథిలముచేయుట - విడిపించుట)
కావున "అవిద్యను నశింపజేసి, బ్రహ్మప్రాప్తి - బ్రహ్మజ్ఞానము కలిగించి, జన్మమరణరూప బంధనములనుండి జీవులను విడిపింపజేయుటకు ముఖ్య సాధనము (ఉపనిషత్) ఉపనిషత్తు" అనబడును. ఉపనిషత్తు బ్రహ్మవిద్య యనియు సామాన్యముగ జెప్పబడును.

యజుర్వేదమునందు నలుబది యధ్యాయము లున్నవి. చివరి యధ్యాయమే ఈశావాస్యోపనిషత్తుగ వ్యవహరింపబడుచున్నది. ఈ యధ్యాయము నందలి మొదటి మంత్రము -

"ఈశావాస్య మిదగ్ం సర్వం" అని ప్రారంభింపబడును. అందు వలననే యీ యుపనిషత్తునకు "ఈశావాస్యోపనిషత్తు అని నామము ప్రసిద్ధమైనది. సంక్షేపముగ "ఈశోపనిషత్తు" అనియు వ్యవహరించుట కలదు.

ఈ యుపనిషత్తు ఉపనిషత్ సాహిత్యమున ప్రథమము. ఇయ్యది యజుర్వేదమున కంతిమాధ్యాయమగుట వలన వేదాంతముగ వ్యవహరింపబడినది. తక్కిన కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యక, శ్వేతాశ్వతరాద్యుపనిషత్తులన్నియు వేదభాగములు కావు. వేదముల యంతిమ భాగములును కావు. కాని, ఈశోపనిషత్తు మాత్రము వేదముయొక్క చివరి యధ్యాయమై వేదాంతమని వ్యవహరింపబడినందున మిగిలిన యుపనిషత్తులకును వేదాంతము లను నామము సామాన్యమైనది. కేనాద్యుపనిషత్తులు వేదాంతములని చెప్పబడినను, నవి వేదభాగములు కావని భావము. అయ్యవి మహర్షులచే రచియింపబడినవి. మహర్షులు వేదములను జదివి, వాని యర్థములను గ్రహించి, స్వానుభవ పూర్వకముగ రచియించిన గ్రంథములని భావము. నేటి విద్వాంసులు ఈ భేదమును పాటింపక "ఈశావాస్యము" వలెనే కేనాదులు కూడ వేదశిరస్సులు, వేదాంతములు. (వేదములోని చివరి భాగములు) అని

వ్యవహరించుచున్నారు. వాస్తవ మట్లుగాదు. ఈశావాస్యము ఈశ్వరీయప కేనాదులు అర్షములు. ఈ భేదమును గుర్తించుట చదువరులకు ముఖ్యము.

భారతీయ సంప్రదాయము ననుసరించి వేదములు పరమ ప్రమాణములు - స్వతః ప్రమాణములుగ నెంచబడుచున్నవి. వాని ప్రామాణ్యమును సాధించుటకు మఱియొక ప్రమాణ మవసరము కాదు. అవి ప్రదీపమువలె స్వయంప్రకాశము లని భావము. వేదములు కాక మిగిలిన గ్రంథము లన్నియు పరతః ప్రమాణములని యంగీకరింపబడును. వేదముల కనుకూలముగా నున్నంతవఱకు నవి ప్రమాణములని భావము. వేదేతర సాహిత్యమున వేదములందు ప్రతిపాదింపబడిన విషయములకు విరుద్ధముగ జెప్పబడిన విషయములు ప్రమాణములు కావని తాత్పర్యము. కావుననే ఈశోపనిషత్తు మిగిలిన యుపనిషత్తులకు మించినదై వేదాంత గ్రంథములలో ప్రాధాన్యము వహించుచున్నది.

ఈ యుపనిషత్తులకు శ్రీశంకర భగవత్పాదులు మున్నగు నాచార్యులు పలువురు భాష్యములు, వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. వానిని తెలుగు భాషలోనికి మార్చి తెలుగు పాఠకుల కందించినవారు కూడ నున్నారు.

నేనుమాత్ర మీ యుపనిషత్తును శ్రీ మద్దయానంద మహర్షి ప్రణీత భాష్యానుసారముగ తెలుగున ప్రతిపదార్థముతోను, భావార్థముతోను జేర్చి, తెలుగు పాఠకుల కందజేయుచున్నాడ. దీనితోబాటు విశేష వ్యాఖ్యానము కూడ నీ పుస్తకములో జేర్చియున్నాను. అయ్యది స్వర్గీయ గురుదత్త విద్యార్థి, ఎమ్. ఏ. వ్యాఖ్యానమున కనుసరణము. విద్యార్థి వ్యాఖ్యానము ఉపనిషదర్థమును వైజ్ఞానిక పద్ధతిలో బాగుగ వివరించుచున్నది. దానిని పఠించినందువలన పాఠకులకు వేదాంత రహస్యము బాగుగ బోధపడగలదని యెంచి యిట్లు చేసియున్నాడ. అందలి వైశిష్ట్యమును చదువరులు మనోయోగముతో జదివి గుర్తించినచో నా ప్రయత్న మొకింత సఫలము కాగలదు.

# త్రైత్వవాదము

"ఓ3మ్ ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వ
త్త్యనశ్న న్నన్యోఽ భిచాకశీతి." ఋ.

ఒకింత సమానఖ్యాతి గలిగి కలిసియుండు రెండు సుపర్ణులు ఒకే వృక్షమును పరిష్వంగ మొనర్చుచు నున్నవి. అం దొకటి వృక్షఫలమును పిప్పలమును రుచి చూచుచున్నది. రెండవది తినక అంతట ప్రకాశించు చున్నది.

ఈ ఋఙ్మంత్రమున నాలంకారికముగ ప్రపంచ మూలపదార్థములు వర్ణింపబడినవి. ఇందు రెండు సుపర్ణులు రెండు చేతన పదార్థములు - జీవేశ్వరులు. వృక్షము జడపదార్థము - మూలప్రకృతి. జీవు డీ ప్రకృతిరూప వృక్షము నంటిపెట్టికొని యుండి యందు ఫలించు ఫలముల ననుభవించు చుండు ననియు, పరమేశ్వరుడు ప్రకృతియందు వ్యాపకుడై యుండి జీవు డొనర్చు కర్మలను వీక్షించుచు కర్మల కనుకూల ఫలముల నొసంగుచుండు ననియు వర్ణింపబడినది.

యజుర్వేదమున నంతిమాధ్యాయరూప మగు నీ యీశావాస్యోపనిషత్తునందు ప్రథమ మంత్రమున 'ఈశావాస్య మిదగ్ం సర్వ' మ్మని ఈశ పదముతో మంత్రము నారంభించి పరమేశ్వర తత్త్వము నిర్దేశింపబడినది 'ఇదం సర్వ' మ్మను పదములతో జడతత్త్వము-ప్రపంచము నిర్దేశింపబడినది. ఈశునిచే నీ దృశ్యమాన ప్రపంచ మంతయు నాచ్ఛాదింపబడియున్నది. అను నీ వాక్యముమూలమున నీశ్వరుడు వ్యాపకు డనియు జడప్రపంచము వ్యాప్యమనియు స్పష్టమగుచున్నది. మంత్రము నందలి 'అభిచాకశీతి' అను

పదప్రయోగముచే పరమేశ్వర తత్త్వము ప్రకాశాత్మకము - జ్ఞానాత్మకమనియు తెలుపబడినది. కావున నీశతత్త్వము జ్ఞానాత్మకమైన చేతనమని గుర్తింపనగును. ఈశునిచే (ఇదం సర్వం ఈశావాస్యమ్) 'ఈ ప్రపంచమంతయు వసింప యోగ్యముగ జేయదగియున్నది. అనుటంబట్టి జడ ప్రపంచము పరమేశ్వరునిచే సృష్టింపబడినది - కారణ రూపములో నుండిన ప్రకృతి కార్యరూపమున పరిణమింప జేయబడిన దని బోధపడుచున్నది.

ఈశ్వరుడు కర్త. సృష్టికార్యము. లోకమున మనము కార్యమును జూచి కారణముల నెఱుగ గలుగుచున్నాము. కార్యము స్థూలము. కారణము సూక్ష్మము. స్థూలమును విభజించి దానికి కారణభూతము లగు తత్త్వముల నెఱుగుటయే నేటి వైజ్ఞానికుల చేయుపని. ప్రాచీన దార్శనికులు చేసినపనియు నిదియే. వారి దర్శనములతో మన మిదియే కనుగొందుము. కార్యము సంయోగజన్యము, సూక్ష్మపదార్థముల విశిష్టసంయోగరూప పరిణామమే కార్యము. మట్టి కణములు కలిసి కుండగా మాఱును. తంతువులు కలిసి వస్త్రముగా నేర్పడును. ఇట్టివే మిగిలిన పదార్థము లన్నియు. దార్శనికులు ప్రపంచ కార్యపదార్థములను పరిశీలించి ప్రతి కార్యమునకును ముత్త్రివిధములగు కారణము లుండునని నిర్ణయించిరి. ఉపాదానకారణము, నిమిత్త కారణము, సాధారణ కారణము. ఇందు నిమిత్తకారణము రెండు విధములు. ఒకటి చేతన నిమిత్తకారణము - కర్త. రెండవది కర్త యుపయోగించు సాధనములు. ఇట్లు విభజించి కారణముల నెఱిగిన పిమ్మట నొక యుదాహరణమున వీనిని గుర్తించుట యెంతయు మంచిది. కుండ యొక కార్యము. దానికి ఉపాదానకారణము మట్టి. అది కుండగా మాఱుట కుపయోగపడు సాధనములు కుమ్మరి, చక్రము, దండము, జలము, దారము మున్నగునవియన్నియు నిమిత్తకారణములు. వీనిలో కుమ్మరి చేతన నిమిత్త కారణము - కర్త. మిగిలినవి జడనిమిత్తములు. పైన వర్ణించిన కార్యకారణముల కవినాభావ సంబంధ ముండునని చదువరులు సులభముగా

గుర్తింపగలరని యెంచెద. ఉపాదాన కారణమైన మట్టి లేనిచో కుండ యేర్పడదు. మట్టి యున్నను దానిని కార్యరూపమున కుండగా మార్చు కుమ్మరి లేనిచో మట్టి కుండగా మాఱదు. మట్టియు, కుమ్మరియు నున్నను చక్రదండాదులు లేకున్న కుండ నిర్మితము కాదు. ఇట్లు కార్యకారణముల యవినాభావసంబంధమును పాఠకు లెన్నడును మఱవరాదు.

ఈ ప్రపంచ కార్యపదార్థము లేర్పడు విధము, వాని కారణ స్థితిగతు లలో నింకను గొన్ని విషయములు తెలిసికొనుట మిక్కిలి అవసరము. కార్యపదార్థమునందలి గుణము లన్నియు కారణ పదార్థముల గుణముల మూలమున నేర్పడును. అందునను ఉపాదాన కారణమునం దుండు గుణములే కార్యగుణములకు హేతువులు. ఉపాదాన కారణ గుణములే కార్యమునందు జేరునని మఱియొక విధముగ జెప్పవచ్చును. నిమిత్త కారణ గుణములు కార్యమున సంక్రమింపవు. మట్టిలో నుండు గుణములే కుండ యందు జూ డ న గు ను. కుమ్మరి, చక్రదండాదులగుణములు కుండలో నేర్పడవు.

ఇట్లు కార్యకారణముల సంబంధము, వాని స్థితిగతులు నెఱిగిన పిమ్మట జీవేశ్వర ప్రకృతుల సమ్మేళన మగు నీ ప్రపంచమును, దాని మూల కారణములను గూర్చి యొకింత విచారింతము.

**ప్రకృతి:-** ప్రపంచమును మనము స్థూలదృష్టితో చూచినపుడు ఇందు జడములు, చేతనములు - ప్రాణులు నను రెండు విధములగు వస్తువులు పండితులు పామరులు ననుభేదము లేక యెల్లరకు గోచరించు చున్నవి. ప్రాణుల దేహములు మొదలు ప్రపంచ పదార్థములన్నియు జడములు. ఇవియన్నియు కార్యములు; కారణపదార్థ జన్యములు. లోక మున విభజింప వీలయిన వన్నియు కార్యపదార్థములని యెఱుంగవలయును. కార్యరూపము ధరించు భాగములే వాని యుపాదానకారణములు. ఇట్లు స్థూలములను విభజించి వాని సూక్ష్మ కారణ భాగములను కనుగొనుచు

ముందుకు సాగిన చివరకు విభజింప వీలుకాని సూక్ష్మకారణ విభాగమును జేరుదుము. ఆ యవిభాజ్య కారణద్రవ్యములే పరమాణువులు. ప్రకృతి, అవ్యక్తము, ప్రధానము, మాయ యని చెప్పబడును. ఈ ప్రపంచగత జడ పదార్థముల కన్నింటికి మూల సూక్ష్మ తత్త్వము కూడ సత్పదార్థమే. దీని యునికి కెన్నడు నెట్టి భంగము కలుగదు. ఇయ్యది మిథ్య కాదు. అభావాత్మకము కాదు. అభావాత్మక పదార్థమునుండి భావాత్మకమగు నీ స్థూల ప్రపంచ మెన్నడు నేర్పడదు. భావాత్మక ప్రపంచమునకు మూలము ఉనికి (సత్తా) లేని వస్తు వెన్నడును కాజాలదు. కావుననే భగవద్ గీతయందు-

"నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః"

అని స్పష్టముగా నుడువబడినది. నేటి వైజ్ఞానికులు నియ్యది యంగీకరించుచున్నారు. ఈ మూలతత్త్వమునే కపిలాచార్యుడు ప్రకృతి, ప్రధానము, అవ్యక్తము నను పదములతోను, న్యాయవైశేషికకారులు గౌతమ కణాదులు పరమాణువు శబ్దముతోను, వేదాంతులు మాయాపదముతోను తమ తమ దర్శనములలో కీర్తించి యున్నారు. ఇయ్యదియే పైఋక్కునందు వృక్ష పదముతో నిర్దేశింపబడినది. ఈ జడతత్త్వము పరిణామ స్వభావము కలిగి యుండును. దీని స్థూల పరిణతరూపమే యీ జగత్తు. ఇయ్యది చేతనులగు జీవులకు భోగ్యము- సుఖదుఃఖరూపము లగు ననుభవములు కలిగించును.

**జీవులు** :- స్థూలమగు నీ ప్రపంచమునందలి పదార్థములతో గూడి శుభాశుభకర్మల నొనర్చుచు వానికి ఫలరూపమున లభించు సుఖదుఃఖముల ననుభవించువాడే జీవుడు. జీవుడు చేతన తత్త్వము. అది సూక్ష్మము ఇంద్రియగమ్యము కానిది. 'ఇచ్ఛా ద్వేష సుఖదుఃఖ జ్ఞాన ప్రయత్నములు' దాని గుణములు. జీవతత్త్వము శరీరమునందుండి దానితో లోకమున వర్తించునపుడు జీవ గుణము లిచ్ఛాద్వేషాదులు గుర్తింపనగును. ఈ గుణములు జడములకు జెందినవి కావు. కావుననే శరీరమునుండి జీవుడు వెడలిపోయినపు డీ గుణములు శరీరమున (శవమునందు) గానరావు. ఇవి

జీవుని గుణములు కావున జీవునితో వెడలిపోవును. పదార్థమునకు దాని విశేష గుణములతో నిత్యసంబంధ ముండును. రూప రస గంధాకృత్యాది గుణములు జడపదార్థమునకు జెందినవి. కావున నవి శరీర మున్నంతవఱకు దాని నంటిపెట్టుకొని యుండును. ప్రాణులలో ప్రతి శరీరమునందు నొక జీవు డుండును. అత డందుండి నానావిధ కర్మల నొనర్చును. కర్మల నొనర్చువాడు కర్త యగును. అత డా కర్మల నొనర్చుటలో స్వతంత్రుడై యుండును. కావుననే పాణిని మహర్షి 'స్వతంత్రః కర్తా' అని సూత్రించి యున్నాడు. 'కర్మ ణ్యేవాధికార స్తే' కర్మను చేయుటకు, చేయకుండుటకు, విపరీతముగ జేయుటకు నీ కధికార మున్నది - నీవు స్వతంత్రుడవు. 'మా ఫలేషు కదాచన' 'ఫలమున నీ కధికారము లేద'ని కృష్ణు డర్జునునకు జెప్పినట్లు గీతలో జూచుచున్నాము. ఇట్లు జీవులు స్వతంత్రులై కర్మల నొనర్చుచు వాని మూలమున వచ్చు ఫలముల ననుభవింప బాధ్యులగుచున్నారు. కర్తకు ఫలము లభించుట యనివార్యమని భావము. ప్రాణుల శరీరములలో నన్నింటియందును నొకే చేతనపదార్థ ముండునను వాదము ప్రత్యక్షాది ప్రమాణములకు, అనుభవమునకు విరుద్ధము. జీవు డన్నింటియందు నొకే చేతనతత్త్వ మగునెడల ప్రాణుల సుఖముల యనుభవమునందు భేద ముండరాదు. అన్ని ప్రాణులందు నొకే జీవు డుండు నెడల నతడు వ్యాపకు డగును. అట్టి యెడల జన్మమరణములు సంభవములు కావు. వ్యాపకపదార్థము శరీరములను విడిచి పోవుటగాని, ఎటనుండియో వచ్చి శరీరములందు ప్రవేశించుటగాని యసంగతము లగును. శరీరముల నుండి జీవుల యుత్క్రాంతి అనుభవగమ్యము; శాస్త్రచోదితమును.

**ఈశ్వరుడు:-** పైన వర్ణింపబడిన జడచేతనములతో గూడిన నీ స్థూల ప్రపంచమునకు కర్తయే ఈశ్వరుడు. ఈశ్వర నామముచే పేర్కొనబడునదియు నొక పదార్థమే. అయ్యది చేతనతత్త్వము. ఈ ప్రపంచమునకు చేతన నిమిత్తకారణము. కర్తృకార్యముల కున్న యవినాభావ సంబంధ

మును గూర్చి పూర్వమే యుల్లేఖించి యున్నాము. కర్తలేక కారణ మేర్పడజాలదు. జడపదార్థమునందు స్వాభావికమగు క్రియ యుండదు. అందలిక్రియ నైమిత్తికము. చేతనము దానికి నిమిత్తము. మృత్కణములు స్వయముగా సంయుక్తములై యిటుకలు కావు. ఆ యిటుకలు స్వయముగా కలిసి గోడలుగా నేర్పడవు. బంగారము నగలుగా మాఱదు. తంతువులు స్వయముగా వస్త్రములు కావు. వీనిలో క్రియను గలిగించి, తన్మూలమున వీనిని పరస్పర సంయుక్తములుచేసి భిన్నభిన్న రూపములలో వస్తువులను నిర్మించువారు కులాలాదులు, చేతనులు-జ్ఞానాది గుణయుక్తులగు ప్రాణులు అట్లే ప్రకృతిని స్థూలముగ పరిణమింపజేయు పదార్థమే యీశ్వరుడు-సృష్టి కర్త యనబడును. విశాలమగు నీ విశ్వమును సృష్టించు తత్త్వము వ్యాపకము కాక తప్పదు. ఈశ్వరతత్త్వ మెట్టిదియో, దాని గుణగణము లెట్టివియో యీ యుపనిషత్తునందు పాఠకులు చదువుదురు. విశేషముగ నిట వ్రాయుట చర్వితచర్వణ మగును. పరమేశ్వరుడు సృష్టికర్త. సృష్టికి నిమిత్త కారణము. ఉపాదాన కారణము కాదు. నిమిత్తోపాదాన కారణములకు గల భేదము పూర్వమే చెప్పబడినది. ఆ భేదము నెన్నడు పాఠకులు విస్మరింపరాదు.

జీవప్రకృతులను స్వతంత్రసత్తా గల భిన్నతత్త్వములని యంగీకరింపక కేవల మొక చేతనతత్త్వము నంగీకరించువారు ప్రపంచ సమస్యను చక్కగా పరిష్కరింపజాలరు. 'బ్రహ్మ సత్యం జగ న్మిథ్యా' అను నిట్టి వాక్యముల నాధారముగ తీసికొని, వేదార్థములను గమనింపక కేవలము బ్రహ్మము తక్క మఱియొక పదార్థమే లేదనువారు ప్రపంచరూప కార్యమునకు ఉపాదానకారణము బ్రహ్మమునో, లేక అభావమునో యంగీకరింప వలసిన వా రగుదురు. అభావమునుండి భావపదార్థ మేర్పడ దనుట శాస్త్ర సమ్మతము. ప్రాచీన మహర్షుల సిద్ధాంతము. నేటి వైజ్ఞానికుల పరీక్షణల ఫలితము. కావున ప్రపంచమునకు ఉపాదాన కారణము బ్రహ్మ మనవలసి

వచ్చును. అట్లంగీకరింతుమేని బ్రహ్మమున గల గుణములే ప్రపంచమున గానవలసి యుండును. కాని, బ్రహ్మగుణములు ప్రపంచమున లేకపోగా తద్విరుద్ధగుణము లిందు గనబడుచున్నవి. చూడుడు : బ్రహ్మము చేతనము, ప్రపంచ మచేతనము. బ్రహ్మము వ్యాపకము, ప్రపంచము అవ్యాపకము. బ్రహ్మము జ్ఞానాత్మకము, ప్రపంచము అజ్ఞానాత్మకము-జడము. బ్రహ్మము అపరిణామి, ప్రపంచము పరిణామి. బ్రహ్మము వృద్ధిక్షయాదులు లేనిది, ప్రపంచము వృద్ధిక్షయాది వికారయుక్తము. ఇట్లు పరిశీలించిన కొలది ప్రపంచమునకు బ్రహ్మము ఉపాదానకారణ మెన్నడు నే విధమునను గాజాలదని స్పష్ట మగుచున్నది. కావున కేవల బ్రహ్మవాదము యుక్తి యుక్తము కాదు.

ఇట్లు వేదమునందు వర్ణింపబడిన జీవేశ్వర ప్రకృతి తత్త్వములను వేఱువేఱుగ మూడింటి నంగీకరించుట యనివార్య మగుచున్నది. ఇదియే వేదవాదము - జీవేశ్వర ప్రకృతులు నిత్యసత్యములు. వాని యునికి కెన్నడు నెట్టి భంగమును గలుగదు. వాని యాథార్థ్యమును బాగుగ నెఱిగిన విద్వాంసులు వేదవిహిత సత్కర్మల నాచరించి, యసంగులై తరింతురు.

వేదములందు, ప్రాచీనమహర్షి ప్రణీతములగు నితరము లయిన ఉపనిషదాది గ్రంథములందును పరమాత్మ సాక్షాత్కారమే మోక్షమునకు ముఖ్యసాధన మని స్పష్టముగా గోచరించును.

"త మేవ విదిత్వాఽతిమృత్యు మేతి
నాన్యః పంథా విద్యతే అయనాయ."

'పరమేశ్వర జ్ఞానము - సాక్షాత్కారము తక్క వేఱొండు మార్గము మోక్షమునకు లే' దని వేదము.

"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానామ్
ఏకో బహూనాం యో విదధాతి కామాన్

త మాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతమ్ నేతరేషామ్."

'నిత్యములగు ఆకాశాది పదార్థములకు నిత్యుడు, చేతన జీవులకు చైతన్యము నొసంగువాడు, ఒక్కడే. బహుసంఖ్యాకులగు జీవులకు వారి ప్రయత్నానుకూలముగ కామనల నొసంగువాడును, ఎల్ల జీవులందును స్థితుడై యుండువాడును నగు పరమాత్మని ఆత్మసాక్షాత్కార పూర్వకముగ సాక్షాత్కార మొనర్చుకొను వారికే శాశ్వతసుఖము - ఆనందము - మోక్షము లభించు'నని యుపనిషత్తులు.

"న జ్ఞానాదృతే ముక్తిః" ఆత్మజ్ఞానము కలుగనిది ముక్తి లేదని దార్శనికులు. ఇట్లు ఆత్మతత్త్వజ్ఞానమే మోక్ష సాధనమని యెల్లరు నేక గ్రీవముగా నంగీకరించు చున్నారు.

అట్టి యాత్మతత్త్వజ్ఞానము కల్గుటకు మానవులు యమనియమము లను పాలించుచు నిత్యము చిత్తమాలిన్యమును దూర మొనర్చుకొనుటకు యోగాభ్యాస మొనర్చుట యెంతయు నవసరము. వేదవిహిత కర్మలను ఫలాపేక్ష విడిచి యాచరింపవలయును. ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనము లిందుల కెంతయు తోడ్పడును.

లోకమున నేడు భగవద్ భక్తులు ఉపాసన విషయమున నెంతయు భ్రమపడుచున్నారు. ఉపాసన మన భగవంతునకు బదులొక విగ్రహమును కల్పించుకొని, దానిని ఆవాహ నా ద్యుత్సర్జన పర్యంతము గల షోడశోప చారములతో బూజించుటయే యని యెంచుచున్నారు. ఇయ్యది భగవంతుని సగుణోపాసన మనియు నుడువుదురు. ఇట్టి వారికి సగుణ నిర్గుణోపాస నములన నేమో తెలియ దనుట సత్యము. "త దుపాసితవ్యమ్, త దన్వే ష్టవ్యమ్, త ద్విజిజ్ఞాసి తవ్యమ్" అని బ్రహ్మోపాసన మన బ్రహ్మ జ్ఞానము సంపాదింపదగిన దని యుపనిషత్కారులు నుడువుచున్నారు.

ఉపాసన మన సమీప స్థితి యని యర్థము. భగవదుపాసనము - భగవంతుని సమీపస్థితి. భగవంతుడు జీవుడు నను నీ రెండు తత్త్వములు నిరంతరము సంయుక్తములై యుండును. భగవంతుడు వ్యాపకుడు. జీవుడు వ్యాప్యుడు. వ్యాప్యవ్యాపకములకు మధ్య దేశకాలములచే నంతరము - దూరమెన్నడు నేర్పడదు. కావున నవి నిరంతర సంయుక్త తత్త్వములే. అందువలన జీవుడు దేవుని సమీపించుట యన జీవదేవులకు మధ్య నున్న దేశకాల వ్యవధులను పోగొట్టుకొనుట కాదు. అట్టి వ్యవధులు లేనే లేవు. కావుననే సమీపించుట యన తనకు దేవునకు మధ్య వ్యవధిని కల్పించుచున్న యజ్ఞానమును పోగొట్టుకొని, పరమాత్మ జ్ఞానమును సంపాదించుటయే యని విజ్ఞు లభిప్రాయపడుచున్నారు. జీవుడు దేవుని యథాశాస్త్రము, యథాచార్యోపదేశము తెలిసికొనుటయే. శబ్దార్థసంబంధముల నెఱుంగుటయే కాక యనుభవమునకు దెచ్చుకొనుట యని భావము. కాబట్టి విగ్రహములనో, చిత్రపటములనో పూజించుట భగవంతుని యుపాసన మెన్నడును కాదు. అది సగుణోపాసన మంతకంటెను కాదు. అది కేవలము సాకార జడోపాసన మనవచ్చును. ఆకారవంతము లగు జడవస్తువుల నర్చించి - పూజించి భగవ దుపాసన మొనర్చితి మని యెంచుట ఆత్మ వంచనయే యగును. సాకారవస్తుపూజనము సగుణ బ్రహ్మోపాసన మెట్లు కాగలదు ? బ్రహ్మమునకు ఆకారమను గుణము కలదా ? లేదు. ఆకారము జడపదార్థములగుణము. చేతనగుణము కాదు. భక్తులు నే డీ భేదమును గుర్తింపకున్నారు.

ఈ ప్రపంచమున మూడు మూలతత్త్వములు గలవనియు, నవి జీవేశ్వర ప్రకృతు లనియు నింతకు పూర్వము వ్రాసియున్నాము. తత్త్వములు - పదార్థములు అన్నియు సగుణములు నిర్గుణములు నని రెండు విధముల వ్యవహరింపబడును. కేవల సగుణము, కేవల నిర్గుణము ననబడు పదార్థ మొండును లేదు. ఏ వస్తువునందును సమస్తగుణము లుండవు.

ఎందునను నొక్కగుణమైన నుండకపోదు. పదార్థములు గుణభేదముచేతనే భిన్నములుగా వ్యవహరింపబడును. కావున ప్రతి పదార్థము స్వగుణములచే సగుణ మగును. పరపదార్థగుణము లందులేమి నిర్గుణ మగును. ఇట్లు ప్రకృతి సత్వరజ స్తమో గుణములతోను, శబ్ద స్పర్శ రూప రస గంధాది గుణములతోను గూడి సగుణమనియు, జీవేశ్వరులం దుండు జ్ఞానేచ్ఛాది గుణములు తనలో లేమిచే నిర్గుణ మనియు ననబడును. అట్లే జీవుడు ఇచ్ఛాద్వేషాది స్వగుణములతో గూడి యుండుటచే సగుణు డనియు, జడత్వాది ప్రకృతిగుణములు, సర్వజ్ఞత, ఆనందము, వ్యాపకత్వము మున్నగు నీశ్వర గుణములు తనయందు లేమిచే నిర్గుణు డనియు నుడువబడును. ఇక పరమేశ్వరుడును తనయందలి ఆనందాది గుణములచే సగుణుడనియు, జడత్వాది ప్రకృతి గుణములు, రాగద్వేషాది జీవగుణములు తనయందు లేమిచే నిర్గుణు డనియు బుధులచే వ్యవహరింపబడును. పరమేశ్వరుని యందు ఆకారమనెడి గుణము లేనే లేదు. అది జడమగు ప్రకృతిలో నుండు గుణము. కాబట్టి బ్రహ్మము సాకార మెన్నడు నెవ్విధమునను కాజాలదు. సాకార పదార్థముల కలంకారాదుల నొనర్చి, అభిషేకాదులం జేసి సగుణ బ్రహ్మమును బూజించితిమి - ఉపాసించితిమి అని యనుట సరికాదు. బ్రహ్మము సగుణమైనంత మాత్రమున సాకారమగు ననుట భ్రమ తప్ప యథార్థము కాదు.

కావుననే జడపదార్థములను - శివ విష్ణు నామములతో విగ్రహములను బూజించుట పరమేశ్వరోపాసనము కాదు. జడపూజకులు దుఃఖముల పాలగుదురే కాని, వారికి మోక్షసుఖము -ఆనందము ఎన్నడును లభింపదు. పరమేశ్వరుని సగుణ, నిర్గుణ, ఉభయాత్మకమగు స్వరూపమును సాక్షాత్కారము చేసికొనిన వ్యక్తియే అమరత్వమును బొందును. కేవల సగుణ బ్రహ్మోపాసకుడు కాని, కేవల నిర్గుణ బ్రహ్మోపాసకుడు కాని మోక్షానందము నెన్నడును బొందజాలడు.

ఈశావాస్యోపనిషత్తునందు 'స పర్యగాత్ శుక్ర మకాయ మవ్రణ మిత్యాది' మంత్రమున పరమేశ్వరుని సగుణ నిర్గుణ రూపములు రెండును చక్కగ నిర్దేశింపబడినవి. వాని నెఱిగి యట్లే యుపాసించువాడు మోక్షార్హు డగును. కావుననే యీ యుపనిషత్తు మిగిలిన యుపనిషత్తుల కన్నింటికి తలమానికమగుచు ప్రథమగణ్యమై యున్నది.

ఈ ఉపనిషత్తును మూడవ పర్యాయము ముద్రించి ఆంధ్ర పాఠకుల కందజేయుట కెంతయు సంతసించుచున్నాను. ఈ తృతీయ సంస్కరణమున మహర్షి దయానంద సరస్వతి సంస్కృత భాష్యమును, వేదసమ్మతమగు త్రైత వాదమును గూడ జేర్చితిని.

జనవరి, 1981

బుధవిధేయుడు
గోపదేవ్

ఓమ్

# ఈశావాస్యోపనిషత్తు

## ( యజుర్వేదము - నలుబదవ అధ్యాయము )

(అథ మనుష్యాః పరమాత్మానం విజ్ఞాయ కిం కుర్యు రిత్యాహ.)
మనుజు లీశ్వరు నెఱిగి యేమి చేయవలయును ?

ఈశా వాస్య మిదగ్ం సర్వం యత్ కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్. ౧

పదార్థః :- ఈశా = ఈశ్వరేణ - సకలైశ్వర్య సంపన్నేన - సర్వ శక్తిమతా - పరమాత్మనా, వాస్యమ్=ఆచ్ఛాదయితుం యోగ్యం, సర్వతోఽభివ్యాప్యమ్, ఇదమ్ = ప్రకృత్యాది పృథివ్యన్తమ్, సర్వమ్ = అఖిలమ్, యత్ కిమ్ చ, జగత్యామ్=గమ్య మానాయాం సృష్టౌ, జగత్ = యద్ గచ్ఛతి తత్, తేన, త్యక్తేన = వర్జితేన - తచ్చిత్త రహితేన, భుంజీథాః= భోగ మనుభవేః, మా = నిషేధే, గృధః = అభికాంక్షీః, కస్య స్విత్= కస్యాపి స్విది ప్రశ్నే వా, ధనమ్=వస్తుమాత్రమ్.

అన్వయః :- హే మనుష్యాః! త్వమ్ యదిదం సర్వం జగత్యాం జగదీశావాస్య మస్తి తేన త్యక్తేన భుంజీథాః. కిం చ కస్య స్విద్ధనం మా గృధః.

భావార్థః :- యే మనుష్యా ఈశ్వరాద్ బిభ్యం 'త్యయ మస్మాన్ సర్వదా సర్వతః పశ్యతి. జగ దిద మీశ్వరేణ వ్యాప్తం. సర్వ త్రేశ్వరోఽస్తీతి' వ్యాపక మంతర్యామిణం నిశ్చిత్య కదాచిద ప్యన్యా యాచరణేన కస్యాపి కించిదపి ద్రవ్యం గ్రహీతుం నేచ్ఛేయు స్తే ధార్మికా భూత్వాఽత్ర పర త్రాభ్యుదయ నిఃశ్రేయసే ఫలే ప్రాప్య సదాఽఽనందేయుః.

పదార్థము :- జగత్యాం=గమ్యమానమగు నీ విశ్వమునందు, యత్ కించ జగత్=ఏ చరప్రాణి జగత్తుకలదో, ఇదం సర్వం =ఇదియంతయు, (ప్రకృతి మొదలు పృథివి వఱకు గల ప్రపంచము) ఈశా=సర్వైశ్వర్య వంతుడు, సర్వశక్తియుతుడు నగు పరమాత్మనిచే, వాస్యమ్ = కప్పుటకు యోగ్యమై - వ్యాప్తమై యున్నది, తేన=ఆ కారణముచేత, త్యక్తేన = త్యాగబుద్ధితో - అనాసక్త చిత్తముతో, భుంజీథాః = అనుభవింపుము, కస్యస్విత్ ధనమ్=ఎవరి ధనమును, మాగృధః=అభిలషింపకుము.

భావార్థము :- "మనలను భగవంతు డెల్లప్పుడు నెల్లవిధములజూచు చుండును. ప్రపంచము అతనిచే వ్యాప్తమై యున్నది. అంతట నతడున్నాడు. అతడు వ్యాపకుడు-అంతర్యామి అని నిశ్చయించి యీశ్వరునకు భయపడు మానవులు ఎన్నడును అన్యాయాచరణముతో నెవ్వరి ధనము నపహరింప నెంచరు. అట్టివారు ధార్మికులై యిహపరములం దభ్యుదయ నిఃశ్రేయసము లను బొంది యెల్లపుడు నానందింతురు.

(అథ వైదిక కర్మణః ప్రాధాన్య ముచ్యతే.)

వేద విహిత కర్మముల ప్రాధాన్యము.

కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః
ఏవం త్వయి నాన్యథే తోఽస్తి న కర్మ లిప్యతే నరే. ౨

పదార్థః :- కుర్వన్, ఏవ, ఇహ=అస్మిన్ సంసారే, కర్మాణి = ధర్మ్యాణి వేదోక్తాని నిష్కామ కృత్యాని, జిజీవిషేత్ = జీవితు మిచ్ఛేత్, శతమ్, సమాః = సంవత్సరాన్, ఏవమ్ = అమునా ప్రకారేణ, త్వయి, న=నిషేధే, అన్యథా, ఇతః=అస్మాత్ ప్రకారాత్, అస్తి=భవతి, న = నిషేధే, కర్మ=అధర్మ్య మవైదికం మనోర్థ సంబంధి కర్మ, లిప్యతే, నరే = నయనకర్తరి.

అన్వయః :- మనుష్యా ఇహ కర్మాణి కుర్వన్నేవ శతం సమా జిజీవిషే దేవం ధర్మ్యే కర్మణి ప్రవర్తమానే త్వయి నరే న కర్మ లిప్యతే. ఇతోఽన్యథా నాస్తి లేపాభావః.

భావార్థః :- మనుష్యా ఆలస్యం విహాయ సర్వస్య ద్రష్టారం న్యాయాధీశం పరమాత్మానం కర్తుమర్హాం తదాజ్ఞాం చ మత్వా శుభాని కర్మాణి కుర్వంతోఽశుభాని త్యజంతో బ్రహ్మచర్యేణ విద్యాసుశిక్షే ప్రాప్యోపస్థేంద్రియ నిగ్రహేణ వీర్య మున్నీయాల్పమృత్యుం ఘ్నంతుం యుక్తాహార విహారేణ శతవార్షిక మాయుః ప్రాప్నువంతు. యథా యథా మనుష్యాః సుకర్మసు చేష్టంతే తథా తథైవ పాపకర్మతో బుద్ధిర్ నివర్తతే. విద్యాయుః సుశీలతా చ వర్ధతే.

పదార్థము :- (మనుజుడు) ఇహ=ఈ లోకమున, కర్మాణి=వేద విహిత నిష్కామ ధర్మకర్మములు, కుర్వన్ ఏవ = చేయుచునే, శతం సమాః=నూఱేండ్లు, జిజీవిషేత్=జీవింప గోరవలయును. ఏవం = ఇట్లు (వేదవిహిత కర్మముల నొనర్చు), త్వయి నరే = నరుడవగు నీయందు, కర్మ=(అధర్మయుక్త) కర్మము, న లిప్యతే = అంటదు - బంధనహేతువు కాదు, ఇతఃఅన్యథా=ఇంతకంటె వేఱువిధము, నాస్తి = (కర్మము బంధన హేతువు కానివిధము) లేదు.

భావార్థము :- పరమేశ్వరుడు సర్వ ద్రష్ట, న్యాయాధీశుడు నని యెంచి, అతని యాజ్ఞయే చేయదగినదని నిర్ణయించి, మానవులు సోమరితనమును దరిజేరనీయక శుభకర్మములు ఫలాపేక్ష లేకయే చేయుచుండవలయును. అశుభకర్మముల నాచరింపరాదు. బ్రహ్మచర్యమును పాలించుచు విద్యా సుశిక్షణలను బొందవలయును. ఉపస్థేంద్రియమును నిగ్రహించి వీర్యమును పైకిలాగి-ఓజస్సుగా మార్చి అల్ప మృత్యువును జయింపవలయును. యుక్తాహార విహారముల మూలమున నూఱేండ్లు జీవింపవలయును.మానవులు

శుభకర్మముల నాచరించు నెడల దుష్కర్మములు వారికి దూరమగును. విద్య, ఆయుస్సు, సుశీలత వారికి పెంపొందును.

(అ థాత్మహంతారో జనాః కీదృశా ఇత్యాహ.)

ఆత్మ ఘాతకులు - ఆత్మను విస్మరించువా రెట్లుందురు ?

అసుర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః
తాన్ స్తే ప్రే త్యాపి గచ్ఛంతి యే కే చాత్మహనో జనాః. 3

పదార్థః :- అసుర్యాః = అసురాణాం ప్రాణ పోషణ తత్పరాణా మవిద్యాది యుక్తానా మిమే సంబంధిన స్తత్సదృశః పాప కర్మాణః, నామ= ప్రసిద్ధా, తే, లోకాః=లోకంతే పశ్యంతి తే జనాః, అంధేన = అంధకార రూపేణ, తమసా=అత్యావరకేణ, ఆవృతాః=సమంతా ద్యుక్తా ఆచ్ఛాదితాః, తాన్ = దుఃఖాంధకారావృతాన్ భోగాన్, తే, ప్రేత్య = మరణం ప్రాప్య, అపి = జీవంతోఽపి, గచ్ఛంతి = ప్రాప్నువంతి, యే, కే, చ, ఆత్మహనః = య ఆత్మానం ఘ్నంతి తద్విరుద్ధ మాచరంతి తే, జనాః= మనుష్యాః.

అన్వయః- యే లోకా అంధేన తమసా వృతా, యేకే చాత్మహనో జనాః సంతి తే అసుర్యా నామ, తే ప్రేత్యాపి తాన్ గచ్ఛంతి.

భావార్థః :- త ఏవ అసురా దైత్యా రాక్షసాః పిశాచా దుష్టా మనుష్యా య ఆత్మ న్యన్య ద్వాచ్యన్యత్ కర్మణ్యన్య దాచర న్తి తే న కదాచి దవిద్యా దుఃఖసాగరా దు త్తీ ర్యానందం ప్రాప్తుం శక్నువంతి. యే చ య దాత్మనా తన్మనసా, య న్మనసా తద్వాచా, యద్వాచా తత్ కర్మణాఽనుతిష్ఠంతి త ఏవ దేవా ఆర్యా సౌభాగ్యవంతోఽఖిలజగత్ పవిత్రయంత ఇహాముత్రాతులం సుఖ మశ్నువతే.

పదార్థము :- యే కే=ఎవరు, అంధేన తమసా=అంధకార రూపావరణముతో-అజ్ఞానముతో, ఆవృతాః=ఆవరింపబడుదురో, ఆత్మహనః చ=

ఆత్మ ఘాతకులును - ఆత్మకు విరుద్ధముగ వర్తించువారును, జనాః=జను లున్నారో, తే లోకాః = ఆ మానవులు, అసుర్యాః = ప్రాణపోషకులై దుష్కర్మముల నాచరింతురు, తే=వారు, ప్రేత్యఅపి = చచ్చియు,తాన్= అట్టి యాసురజన్మములనే, గచ్ఛంతి = పొందుదురు.

భావార్థము :- ఎవరు అజ్ఞానముతో కూడుకొని, ఆత్మకు విరుద్ధముగ నడచు కొందురో వారు అసురులు, దైత్యులు, రాక్షసులు, పిశాచులు, దుష్టులు నగుదురు. వారు మనస్సులో నొకటి యుంచుకొని, వాక్కుతో వేఱొకటి చెప్పుదురు. కర్మములలో మఱియొకటి చేయుదురు. అందువలన వారు అవిద్యాదిదోషములలో చిక్కుకొని దుఃఖముల పాలగుదురు. ఆనంద మును బొందజాలరు. అట్లుగాక యెవరు మనోవాక్కాయ కర్మములలో నొక్కటిగా నుందురో వారే దేవతలు, ఆర్యులు ననబడుదురు. వారు సుభగులై లోకమును పవిత్ర మొనర్తురు. అతుల సుఖముల నిహపరములం దనుభవింతురు.

(కీదృశో జన ఈశ్వరం సాక్షాత్కరో తీత్యాహ.)

ఎట్టి మనుజు డీశ్వరుని బొందును ?

అనేజ దేకం మనసో జవీయో
నైన ద్దేవా ఆప్నువన్ పూర్వ మర్షత్
త ద్ధావతోఽ న్యా న త్యేతి తిష్ఠత్
తస్మి న్నపో మాతరిశ్వా దధాతి. ౪

పదార్థః :- అనేజత్=న ఏజతే కంపతే త దచలత్, స్వావస్థాయా శ్చ్యుతిః కంపనమ్ తద్రహితమ్, ఏకమ్=అద్వితీయం బ్రహ్మ, మనసః= మనోవేగాత్, జవీయః అతిశయేన వేగవత్, న, ఏనత్, దేవాః = చక్షు రాదీ నీంద్రియాణి వా, ఆప్నువన్=ప్రాప్నువంతి, పూర్వం=పురస్సరం పూర్ణం, అర్షత్=గచ్ఛత్, ధావతః=విషయాన్ ప్రతి పతతః, అన్యాన్ =

స్థి స్వరూపాద్ విలక్షణాన్ మనో వాగింద్రియాదీన్, అతి=ఉల్లంఘనే, ఏతి=ప్రాప్నోతి గచ్ఛతి, తిష్ఠత్ = స్వ స్వరూపేణ స్థిరంసత్, తస్మిన్= సర్వత్రాఽభివ్యాప్తే, అపః=కర్మ, క్రియాం వా, మాతరిశ్వా = మాతర్యంత రిక్షే శ్వసితి ప్రాణాన్ ధరతి వాయు స్తద్వ ద్వ ర్తమానో జీవః, దధాతి.

అన్వయః :- హే విద్వాంసో మనుష్యాః యదేక మనేజ న్మనసో జవీయః పూర్వ మర్షద్ బ్రహ్మ స్త్యేన ద్దేవా నాప్నువన్ తత్ స్వయం తిష్ఠత్ సత్ స్వానంత వ్యాప్త్యా ధావతోఽన్యా నత్యేతి. తస్మిన్ స్థిరే సర్వ త్రాభివ్యాప్తే మాతరిశ్వా వాయురివ జీవోఽపో దధాతీతి విజానీత.

భావార్థః :- బ్రహ్మణోఽనంతత్వా ద్యత్ర యత్ర మనోయాతి తత్ర తత్ర పురస్తా దేవాభివ్యాప్త మగ్రస్థం బ్రహ్మ వర్తతే. తద్విజ్ఞానం శుద్ధేన మనసైవ జాయతే. చక్షురాదిభి రవిద్వద్భి శ్చ ద్రష్టు మశక్య మస్తి. స్వయం నిశ్చలం సత్ సర్వాన్ జీవాన్ నియమేన చాలయతి; ధరతి చ. త స్యాతిసూక్ష్మత్వా దతీంద్రియత్వా ద్ధార్మికస్య విదుషో యోగిన ఏవ సాక్షాత్కారో భవతి నేతరస్య.

పదార్థము :-(పరమేశ్వరుడు) ఏకమ్=ఒక్కడు, అద్వితీయుడు, అనే జత్=అచలుడు, అతని కవస్థాచ్యుతి కలుగదు, మనసః = మనస్సుకంటె, జవీయః = వేగవంతుడు, పూర్వమ్ = అన్నింటికంటె ముందే, అర్షత్ = ఎక్కడ జూచినను ప్రాప్తించియుండును, ఏనత్ = అతనిని, దేవాః = నేత్రాదీంద్రియములు, న అప్నువన్=పొందనేరవు, తత్=ఆ పరమాత్మ, తిష్ఠత్=కదలక, ధావతః అన్యాన్ = విషయములవెంట పరుగెత్తు మనో వాగాదీంద్రియములను, అత్యేతి=అతిక్రమించును, తస్మిన్ = అతని యందు, మాతరిశ్వా=జీవుడు, అపః=కర్మములను, దధాతి = ధరించును, అర్పించును.

భావార్థము :- పరమాత్మ దనంతుడగుటచే, మనస్సెక్కడకు పోయిను నట ముందే యుండును. ఆ పరమాత్ముని జ్ఞానము శుద్ధమనస్కునకే

కలుగును. నేత్రాది ఇంద్రియములకు పరమాత్మ గోచరింపదు. అవిద్వాంసులకు నందదు. స్వయముగా కదలక ప్రపంచమును నియమబద్ధముగ చలింపజేయును. అన్నింటికి నాధారము. ధార్మికుడైనవాడు కర్తవ్యముల నాచరించుచు ఫలములను పరమాత్మున కర్పించి కర్మయోగియై పరబ్రహ్మను బొందగల్గును.

(విదుషాం నికటేఽవిదుషాం చ బ్రహ్మ దూరేఽస్తీత్యాహ.)
బ్రహ్మము విద్వాంసులకు సమీపము; అవిద్వాంసులకు దూరము.

తదేజతి త న్నైజతి త ద్దూరే త ద్వంతికే
త దంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః. ౫

పదార్థః :- తత్, ఏజతి = కంపతే చలతి మూఢదృష్ట్యా, తత్, న, ఏజతి=కంపతే, కంప్యతే వా, తత్, దూరే = అధర్మాత్మభ్యో ఽవిద్వద్భ్యోఽయోగిభ్యః, తత్, ఉ, అంతికే=ధర్మాత్మనాం విదుషాం యోగినాం సమీపే, తత్, అంతః=అభ్యంతరే, అస్య, సర్వస్య=అఖిలస్య జగతో జీవసమూహస్య వా, తత్, ఉ, సర్వస్య = సమగ్రస్య, అస్య = ప్రత్యక్షాప్రత్యక్షాత్మకస్య, బాహ్యతః=బహి రపి వర్తమానః.

అన్వయః :- హే మనుష్యా స్తద్ బ్రహ్మైజతి త న్నైజతి త ద్దూరే త ద్వంతికే, త దస్య సర్వ స్యాంత స్తదు సర్వ స్యాస్య బాహ్యతో వర్తత ఇతి నిశ్చినుత.

భావార్థః :- హే మనుష్యా స్తద్ బ్రహ్మ మూఢదృష్ట్యా కంపత ఇవ తత్ స్వతో వ్యాపకత్వా న్న చలతి. యే త దాజ్ఞావిరుద్ధా స్తే ఇత స్తతో ధావంతోపి త న్న విజానంతి. యే చేశ్వరాజ్ఞానుష్ఠాతార స్తే స్వాత్మస్థ మతినికటం బ్రహ్మ ప్రాప్నువంతి. యత్ బ్రహ్మ సర్వస్య ప్రకృత్యాదేర్ బాహ్యాభ్యంతరావయవా నభివ్యాప్య సర్వేషాం జీవానా మంతర్యామి రూప

తయా సర్వాణి పాప పుణ్యాత్మక కర్మాణి విజానన్ యాథాతథ్యం ఫలం ప్రయచ్ఛ త్యేత దేవ సర్వైర్ ధ్యేయ మస్మా దేవ సర్వైర్ భేతవ్య మితి.

పదార్థము :- తత్ = ఆ బ్రహ్మము, ఏజతి = (మూర్ఖుల దృష్టిలో) కదలును, తత్ = ఆ బ్రహ్మము, న ఏజతి = (విద్వాంసుల దృష్టిలో) చలింపదు, (అట్లే) తత్ = అది, దూరే = దూరమున నుండును, తత్ ఉ అంతికే = అది సమీపమున నుండును, తత్ = అది, అస్య సర్వస్య = ఈ సమ స్తమునకు, అంతః = లోపల నున్నది, తత్ ఉ సర్వస్యఅస్య = అది యీ సర్వమునకు, బాహ్యతః = వెలుపలను ఉన్నది.

భావార్థము :- ఆ బ్రహ్మము మూఢదృష్టులకు కంపించు (చలించు) నట్లుండును. వా స్తవమున నయ్యది వ్యాపకమగుట వలన చలింపదు. పరమేశ్వరుని ఆజ్ఞకు విరుద్ధముగా వ ర్తించువారు ఇటునటు ఎంత తిరిగియు వాని నెఱుగజాలరు. ఈశ్వరాజ్ఞల ననుష్ఠించువారు తమలోనే అత్యంత సమీపముననున్న బ్రహ్మమును గు ర్తింతురు. ఆ బ్రహ్మము ప్రకృతిమొదలు స్థూలభూతముల వఱకు గల సమ స్త పదార్థములలోను లోపల వెలుపల వ్యాపించి యున్నది. జీవులలోను నంతర్యామియై యున్నది. జీవుల పాపపుణ్య కర్మములను నిరీక్షించుచు, వానికి దగిన ఫలములను సుఖదుఃఖ రూపమున నిచ్చుచుండును. ఆ బ్రహ్మమునే యెల్లరు ధ్యానింపవలయును. దానికే భయపడవలయును.

(అ థేశ్వర విషయ మాహ.)

ఈశ్వర విషయము

యస్తు సర్వాణి భూతా న్యాత్మ న్నేవానుపశ్యతి
సర్వభూ తేషు చాత్మానం తతో న విచికిత్సతి. ౬

పదార్థః :- యః = విద్వాన్ జనః, తు = పునరర్థే, సర్వాణి = అఖిలాని, భూతాని = ప్రా ణ్యప్రాణి రూపాణి, ఆత్మన్ = పరమాత్మని, ఏవ,

అనుపశ్యతి = విద్యా ధర్మ యోగాభ్యాసానంతరం సమీక్షతే, సర్వ భూతేషు=సర్వేషు ప్రకృత్యాదిషు, చ, ఆత్మానం=అతతి సర్వత్ర వ్యాప్నోతి తమ్, తతః=తదనంతరమ్, న, విచికిత్సతి=సంశయం ప్రాప్నోతి.

అన్వయః :- హే మనుష్యాః యఆత్మన్నేవ సర్వాణి భూతాన్యనుపశ్యతి, యస్తు సర్వభూతేషు చాత్మానం చ సమీక్షతే, స తతో న విచికిత్స తీతి యూయం విజానీత.

భావార్థః :- హే మనుష్యాః యే సర్వవ్యాపినం న్యాయకారిణం సర్వజ్ఞం సనాతనం సర్వాత్మానం సకలస్య ద్రష్టారం పరమాత్మానం విదిత్వా, సుఖదుఃఖహానిలాభేషు స్వాత్మవత్ సర్వాణి భూతాని విజ్ఞాయ, ధార్మికా జాయంతే త ఏవ మోక్ష మశ్నువతే.

పదార్థము :- యః తు=ఏ విద్వాంసుడు, ఆత్మన్ ఏవ=పరమాత్మ యందే, సర్వాణి భూతాని=సమస్త పదార్థములను-స్థావరజంగమములను, అనుపశ్యతి = (విద్య, ధర్మము, యోగాభ్యాసము మున్నగువాని మూలమున) నెఱుంగునో, చ=మఱియు, సర్వభూతేషు=సమస్త ప్రాణులలోను, ప్రకృత్యాది పదార్థములందును, ఆత్మానం = ఆత్మను - వ్యాపకుడగు ఈశ్వరుని ఎఱుంగునో, వాడు, తతః = తరువాత, న విచికిత్సతి = సందేహమును పొందడు.

భావార్థము :- సర్వ వ్యాపియు, న్యాయకారియు, సర్వజ్ఞుడు, సనాతనుడు, సర్వాత్మయు, అంతర్యామియు, సర్వద్రష్టయు నగు పరమాత్మను గుర్తించి సుఖ దుఃఖములందు, హాని లాభములందును తనతో తుల్యముగ నెల్ల ప్రాణులను నెఱుంగు విద్వాంసుడు ధార్మికుడగును. అతడే మోక్షమున కర్హు డగును. ముక్తు డగును.

(అథ కేఽవిద్యాదిదోషాన్ జహతీ త్యాహ.)

అవిద్యాది దోషముల నెవరు విడుతురు ?

యస్మిన్ త్సర్వాణి భూతా న్యాత్మైవాభూద్ విజానతః
తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః. ౭

పదార్థః :- యస్మిన్=పరమాత్మని జ్ఞానే విజ్ఞానే ధర్మే వా, సర్వాణి, భూతాని, ఆత్మా=ఆత్మవత్, ఏవ అభూత్=భవంతి, (అత్ర వచనవ్యత్యయే నైకవచనమ్), విజానతః=విశేషేణ సమీక్షమాణస్య, తత్ర = తస్మిన్ పరమాత్మని స్థితస్య, కః, మోహః=మూఢావస్థా, కః, శోకః=పరితాపః, ఏకత్వమ్ = పరమాత్మనోఽద్వితీయత్వమ్, అనుపశ్యతః = అనుకూలేన యోగాభ్యాసేన సాక్షా ద్ద్రిష్టుః.

అన్వయః :- హే మనుష్యా !, యస్మిన్ పరమాత్మని విజానతః సర్వాణి భూతా న్యాత్మైవాభూత్, త త్రైకత్వ మనుపశ్యతో (యోగినః) కో మోహోఽభూత్ కః శోకశ్చ.

భావార్థః :- యే విద్వాంసః సంన్యాసినః పరమాత్మనా సహ చరితాని ప్రాణిజాతాని స్వాత్మవ ద్విజానంతి, యథా స్వాత్మనో హిత మిచ్ఛంతి, తథైవ తేషు వర్తంతే. ఏక మే వాద్వితీయం పరమాత్మానం శరణ ముపాగతాః సంతి తాన్ మోహశోకలోభాదయో దోషాః కదాచి న్నాప్నువంతి. యే చ స్వాత్మానం యథావద్ విజ్ఞాయ పరమాత్మానం విదంతి తే సదా సుఖినో భవంతి.

పదార్థము :- యస్మిన్=ఏ పరమాత్మయందు, జ్ఞానవిజ్ఞానములందు, ధర్మమునందు, విజానతః = విశేషజ్ఞాన దృష్టితో నెఱుగువానికి, సర్వాణి భూతాని=సమస్త ప్రాణులు, ఆత్మైవ=తనవలెనే సమాన సుఖ దుఃఖ ములు కలవిగా, అభూత్ = అగునో, తత్ర = ఆ పరమాత్మయందు, ఏకత్వం=అద్వైత - అద్వితీయ - భావమును, అనుపశ్యతః = చూచువానికి-

అనుకూల యోగాభ్యాసముతో సాక్షాత్కారము చేసికొను యోగికి, కః మోహః=ఏమి మూఢత?, కః శోకః=ఏమి దుఃఖము? ఏదియు గలుగదు.

భావార్థము :- సంన్యాసులు, విద్వాంసులు పరమాత్మయందు సంచరించు సమస్త ప్రాణులను తమతో తుల్యములయిన సుఖదుఃఖములు గలవానిగ నెంచెదరు. వారు అద్వితీయుడగు పరమేశ్వరుని శరణుజొత్తురు. అట్టి వారికి శోక మోహ లోభాదులెన్నడును గలుగవు. అట్లే ఎవరు తమ స్వరూపమును యథార్థముగ గుర్తించి, పరమాత్మనుగూడ దెలిసికొందురో వారు ఎల్లప్పుడు సుఖింతురు.

(పునః పరమేశ్వరః కీదృశ ఇత్యాహ.)

పరమేశ్వరు డెట్టివాడు?

స పర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం
శుద్ధ మపాప విద్ధమ్, కవిర్ మనీషీ పరిభూః
స్వయంభూర్ యాథాతథ్యతోఽర్థాన్
వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః. ౮

పదార్థః :- సః=పరమాత్మా, పరి=సర్వతః, అగాత్=వ్యాప్తోఽస్తి. శుక్రం=ఆశుకరం సర్వశక్తిమత్, అకాయమ్=స్థూలసూక్ష్మకారణ శరీర రహితమ్. అవ్రణం=అచ్ఛిద్ర మచ్ఛేద్యం, అస్నావిరం=నాడ్యాది సంబంధ రహితం, శుద్ధం=అవిద్యాది దోషరహితత్వాత్ సదా పవిత్రమ్, అపాపవిద్ధమ్=యత్ పాపయుక్తం పాపకారి పాపప్రియం కదాచిన్న భవతి తత్, కవిః = సర్వజ్ఞః, మనీషీ = సర్వేషాం జీవానాం మనోవృత్తీనాం వేత్తా, పరిభూః = యో దుష్టాన్ పాపినః, పరిభవతి తిరస్కరోతి సః, స్వయంభూః=అనాది స్వరూపో యస్య సంయోగే నోత్పత్తిర్ వియోగేన వినాశో మాతాపితరౌ గర్భవాసో జన్మవృద్ధిక్షయౌ చ న విద్యంతే, యాథాతథ్యతః=

యథార్థతయా, అర్థాన్ = వేదద్వారా సర్వాన్ పదార్థాన్, వి=విశేషేణ, అదధాత్ = విధత్తే, శాశ్వతీభ్యః = సనాతనీభ్యో ఽనాది స్వరూపాభ్యః స్వస్వరూపే ణోత్పత్తి వినాశ రహితాభ్యః, సమాభ్యః=ప్రజాభ్యః.

అన్వయః :- హే మనుష్యా !, యద్ బ్రహ్మ శుక్ర మకాయ మవ్రణ మస్నావిరం, శుద్ధ మపాపవిద్ధం పర్యగాద్ యః కవిర్ మనీషీ, పరిభూః స్వయంభూః పరమాత్మా శాశ్వతీభ్యః సమాభ్యో యాథాతథ్యతో ర్థాన్ వ్యదధాత్ స ఏవ యుష్మాభి రుపాసనీయః.

భావార్థః :- హే మనుష్యా !, య దనంతశక్తిమ దజం నిరంతరం సదా ముక్తం న్యాయకారి నిర్మలం సర్వజ్ఞం సర్వస్య సాక్షి, నియంతృ, అనాదిస్వరూపం బ్రహ్మ కల్పాదౌ జీవేభ్యఃస్వోక్తై ర్ వేదైః శబ్దార్థవిజ్ఞాపికాం విద్యాం నోపదిశే త్తర్హి కోఽపి విద్వా న్న భవేద్, న చ ధర్మార్థ కామ మోక్షఫలం ప్రాప్తుం శక్నుయాత్, తస్మా దిద మేవ సదై వోపాధ్యమ్.

పదార్థము :- సః ఆ పరమాత్మ, పరి అగాత్=అంతట వ్యాపించి యున్నాడు, శుక్రమ్=శీఘ్రకారి, సర్వశక్తిమంతుడు, అకాయం=స్థూల సూక్ష్మ కారణ దేహరహితుడు, అవ్రణం = ఛిద్రరహితుడు - ఛేదింప సలవికానివాడు, అస్నావిరం = నాడ్యాది సంబంధ బంధనములు లేనివాడు, శుద్ధం=అవిద్యాదిదోషములు లేనందున సదా పవిత్రుడు, అపాపవిద్ధం = పాపయుక్తుడు - పాపములు చేయువాడు-పాపప్రియుడు కానివాడు, కవిః= సర్వజ్ఞుడు, మనీషీ=(జీవుల) మనోవృత్తుల నెఱుగువాడు, పరిభూః = దుష్టులను పరిభవించువాడు, స్వయంభూః = అనాది స్వరూపుడు, సంయోగ వియోగాదులచే నేర్పడి నశించువాడుకాడు, మాతాపితరులు,గర్భవాసము,జన్మ వృద్ధిక్షయములు లేనివాడు, శాశ్వతీభ్యః సమాభ్యః = సనాతనులు-అనాది స్వరూపులు - స్వరూపముతో ఉత్పత్తి వినాశములు లేని జీవులకొఱకు, యాథాతథ్యతః = యథార్థ భావముతో, అర్థాన్ = (వేదము ద్వారమున) పదార్థముల నన్నింటిని, వ్యదధాత్=విశేష రూపమున చేయుచున్నాడు.

భావార్థము :- అనంతశక్తియుక్తుడు, అజన్ముడు, నిరంతరము నెల్ల తావులం దుండువాడు, నిత్య ముక్తుడు, న్యాయకారి, నిర్మలుడు, సర్వసాక్షి, నియంత, అనాది స్వరూపుడు నగు బ్రహ్మము - పరమేశ్వరుడు కల్పారంభమున వేదము మూలమున శబ్దార్థములు, వానికిగల సంబంధమును దెలుపు విద్యలను నుపదేశింపకున్నచో లోకమున మానవులలో నెవరును విద్వాంసు లయ్యెడివారు కారు. ధర్మార్థ కామ మోక్షముల ననుభవించుటకును సమర్థు లయ్యెడివారు కారు. అందువలన నా బ్రహ్మమునే యెల్లపుడు నుపాసింపవలయును.

(కే జనా అంధం తమః ప్రాప్నువం తీత్యాహ.)

ఎట్టివా రంధకారమును బొందుదురు ?

అంధం తమః ప్రవిశంతి యేఽసంభూతి ముపాసతే
తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాగ్ం రతాః. ౯

పదార్థః :- అంధమ్=ఆవరకమ్, తమః=అంధకారమ్, ప్ర = ప్రకర్షేణ, విశంతి, యే, అసంభూతిమ్=అనా ద్యనుత్పన్నం ప్రకృత్యాది రూపం, సత్వరజస్తమోగుణమయం జడం వస్తు, ఉపాసతే=ఉపాస్యతయా జానంతి, తతః=తస్మాత్, భూయః ఇవ = అధిక మివ, తే, తమః= అవిద్యామయ మంధకారమ్, యే, ఉ=వితర్కేణ సహ, సంభూత్యామ్ = మహదాది స్వరూపేణ పరిణతాయాం సృష్టౌ, రతాః=యే రమంతే తే.

అన్వయః- యే పరమేశ్వరం విహాయాఽసంభూతి ముపాసతే తేఽన్ధ స్తమః ప్రవిశంతి, యే సంభూత్యాం రతా స్త ఉ తతో భూయ ఇవ తమః ప్రవిశంతి.

భావార్థః :- యే జనాః సకలజడజగతోఽనాది నిత్యం కారణ ముపాస్యతయా స్వీకుర్వంతి తేఽవిద్యాం ప్రాప్య సదా క్లిశ్యంతి యే చ తస్మాత్ కారణా దుత్పన్నం పృథివ్యాది స్థూలం సూక్ష్మం కార్యకారణాఖ్య మనిత్యం

సంయోగజన్యం కార్యం జగ దిష్ట ముపాస్యం మన్యంతే తే మూఢా మవిద్యాం ప్రా ప్యాధికతరం క్లిశ్యంతి తస్మాత్ సచ్చిదానంద స్వరూపం పరమాత్మాన మేవ సర్వే సదోపాసీరన్.

పదార్థము :- యే = ఎవరు పరమేశ్వరుని విడిచి, అసంభూతిం = అనాది, అనుత్పన్నము, సత్వరజ స్తమోగుణాత్మకమునగు జడ ప్రకృతిని, ఉపాసతే = ఉపాసింపదగినదని యెఱుగుదురో వారు, అంధం తమః = ఆవరించునట్టి అంధకారమును-అజ్ఞానమును, ప్రవిశంతి=ఎక్కువగా బొందుదురు, యే సంభూత్యామ్ = ఎవరు మహ త్తత్వాది రూపమున పరిణమించిన సృష్టియందు, రతాః = రమింతురో, తే=వారు, తతః=అంతకంటె, భూయః ఇవ = ఎక్కుడుగా నుండునట్టి, తమః = అవిద్యారూపమగు నంధకారమును బొందుదురు.

భావార్థము :- సమ స్త జడజగత్తునకు ఉపాదానకారణమగు ననాది నిత్య ప్రకృతిని ఉపాసింపదగినదిగా భావించి, అందు నిమగ్నులగువారు అవిద్యను బొంది, క్లేశముల ననుభవింతురు. ఆ మూల ప్రకృతినుండి యుత్పన్నమైన మహ త్తత్వము - (బుద్ధి) పృథివి మున్నగు స్థూలపదార్థములయందు చి త్తమును లగ్నము చేయువారు అంతకంటెను మిక్కిలి యగు నజ్ఞానమును బొంది యెక్కువ కష్టముల పాలగుదురు. కావున సచ్చిదానంద స్వరూపుడగు పరమాత్మనే సదా యుపాసింపవలయును.

(పునః మనుష్యాః కిం కుర్యు రిత్యాహ.)

మనుజు లేమి చేయవలయును ?

అన్య దేవాహుః సంభవా దన్య దాహు రసంభవాత్
ఇతి శుశ్రుమ ధీరాణామ్ యే న స్తద్ విచచక్షిరే. ౧౦

పదార్థః :- అన్యత్=కార్యఫలం వా, ఏవ, ఆహుః=కథయన్తి, సంభవాత్=సంయోగజన్యాత్ కార్యాత్, అన్యత్=భిన్నమ్, ఆహుః =

కథయంతి, అసంభవాత్ = అనుత్పన్నాత్ కారణాత్, ఇతి = అనేన ప్రకారేణ, శుశ్రుమ=శృణుమః, ధీరాణాం=మేధావినాం, విదుషాం యోగినామ్, యే, నః=అస్మాన్ ప్రతి, తత్=తయోర్ వివేచనమ్, విచచక్షిరే= వ్యాచక్షిరే.

అన్వయః :- హే మనుష్యా ! యథా వయం ధీరాణాం సకాశాద్ యద్ వచః శుశ్రుమ యే న స్తద్ విచచక్షిరే, తే సంభవా దన్యదే వాహు రసంభవా దన్య దాహు రితి యూయ మపి శృణుత.

భావార్థః :- హే మనుష్యా ! యథా విద్వాంసః కార్యాత్ కారణా ద్వస్తునో భిన్నం భిన్నం వక్ష్యమాణ ముపకారం గృహ్ణంతి గ్రాహయంతి తద్ గుణాన్ విజ్ఞాయ విజ్ఞాపయ న్త్యేవ మేవ యూయ మపి నిశ్చినుత.

పదార్థము:- యే, నః, విచచక్షిరే=ఎవరు, మాకు, వివరించి చెప్పిరో అట్టి, ధీరాణాం=విద్వాంసులు, ధీమంతులు, సంభవాత్ = జనించిన కార్యరూప వస్తువువలన, అన్యత్ ఏవ = వేఱే ఫలము కలుగునని, ఆహుః= చెప్పుదురు, అసంభవాత్=జనింపని కారణరూప వస్తువువలన, అన్యత్= మఱియొక ఫలము కలుగునని, ఆహుః=చెప్పుదురు, ఇతి శుశ్రుమ = అని, వినుచున్నాము.

భావార్థము :- కార్యరూప జడవస్తువుల నుపాసించుటవలన కలుగు ఫలము వేఱనియు, కారణరూప పదార్థము నుపాసించుటవలన కల్గు ఫలము వేఱనియు విద్వాంసులు, ధీరులు నైనవారు చెప్పుదురు. కాబట్టి మానవులారా! మీరును ఆ యా వస్తుగుణములను, వాని నుపాసించుటవలన కల్గు ఫలములను అట్లే గుర్తింతురుగాక ! ఫలభేదము ముందురాబోవు మంత్రమున జెప్పబడును.

(పునర్ మనుష్యైః కార్యకారణాభ్యాం కిం కిం సాధనీయ మిత్యాహ.)

మానవులు కార్యకారణ రూపవస్తువులవలననేమి సంపాదించుకొనవలయును?

సంభూతిం చ వినాశం చ య_స్తద్ వేదోభయగ్ం సహ
వినా శేన మృత్యుం తీర్త్వా సంభూ త్యామృత మశ్నుతే. ౧౧

పదార్థః :- సంభూతిమ్ = సంభవ_న్తి యస్యాం తాం కార్యరూపాం సృష్టిమ్, చ=తస్యా గుణకర్మ స్వభావాన్, వినాశమ్=వినశ్యం త్యదృశ్యాః పదార్థా భవ_న్తి యస్మిన్, చ = తద్గుణ కర్మ స్వభావాన్, యః, తత్ వేద=జానాతి, ఉభయం = కార్యకారణరూపం జగత్, సహ, వినా శేన= నిత్యస్వరూపేణ విజ్ఞాతేన కారణేన సహ, మృత్యుం=శరీర వియోగజన్యం దుఃఖమ్, తీర్త్వా = ఉల్లంఘ్య, సంభూత్యా=శరీరేంద్రియాంతఃకరణ రూప యోత్పన్నయా, కార్యరూపయా ధర్మ్యే ప్రవ_ర్తయిత్ర్యా సృష్ట్యా, అమృతమ్=మోక్షమ్, అశ్నుతే=ప్రాప్నోతి.

అన్వయః :- హే మనుష్యాః! యో విద్వాన్ సంభూతిం చ వినాశం చ సహోభయం తద్ వేద స వినాశేన సహ మృత్యుం తీర్త్వా సంభూత్యా సహామృత మశ్నుతే.

భావార్థః :- హే మనుష్యాః! కార్యకారణరూపే వస్తుని నిరర్థకే న_స్తః. కిం తు కార్యకారణయోర్ గుణకర్మస్వభావాన్ విదిత్వా ధర్మాది మోక్షసాధనేషు సంయోజ్య స్వాత్మకార్యకారణయో ర్విజ్ఞాతేన నిత్యత్వేన మృత్యుభయం త్యక్త్వా మోక్షసిద్ధిం సంపాదయ తేతి కార్యకారణాభ్యా మన్య దేవ ఫలం నిష్పాదనీయ మితి. అనయోర్ నిషేధో హి పరమేశ్వర స్థాన ఉపాసనా ప్రకరణే వేదితవ్యః.

పదార్థము :- యః = ఎవడు-ఏ విద్వాంసుడు, సంభూతిం=కార్య రూపమగు స్థూల జగత్తును, చ=దాని గుణకర్మ స్వభావములను, వినాశం,

చ=దేనిలో కార్యరూప పదార్థములు నశించి విలీనమగునో ఆ కారణ జగత్తును, తత్ ఉభయం=ఆరెంటిని, సహ=తోడ్తో, వేద=ఎఱుంగునో, అతడు, వినాశేన = కారణ ప్రకృతి జ్ఞానముతో, మృత్యుం తీర్త్వా = మృత్యువు వలన కలుగు దుఃఖమును దాటి, సంభూత్యా=కార్యరూపమగు నీ శరీరముతో ధర్మాచరణ మొనర్చి, అమృతం = మోక్షానందమును, అశ్నుతే = అనుభవించును.

భావార్థము :- ప్రపంచమునగల పదార్థములలోగల కార్య కారణ భావము వ్యర్థమైనదికాదు. కావున ఆ కార్యకారణముల గుణకర్మ స్వభావముల నెఱిగి, వానిని ధర్మాది మోక్షసాధనములతో సంయుక్తము చేసికొనవలయును. ఇట్లే మానవశరీరము అనిత్యము-కార్యరూపము. దానికి కారణ రూపములు గలవు. అవి నిత్యములే. కావున మరణ భయమును విడిచి మోక్షసిద్ధికై యత్నింపవలయును. ఇట్లు ఈ కార్యకారణ రూపజగత్తువలన పొందవలసిన ఫలము అన్యము. కార్య కారణ రూపజగత్తునందు రతులు కాక, వానిని త్యజించి పరమాత్మ నుపాసింపవలయునని భావము.

(అథ విద్యాఽవిద్యోపాసన ఫల మాహ.)

ఇక విద్యావిద్యల యుపాసన ఫలమేమన

అంధం తమః ప్రవిశన్తి యేఽవిద్యా ముపాసతే

తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతాః.౧౨

పదార్థః :- అంధమ్=దృష్ట్యావరకరూపమ్, తమః=గాఢమజ్ఞానమ్, ప్రవిశంతి, యే, అవిద్యామ్=అనిత్యాశుచి దుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మ ఖ్యాతి ర వి ద్యేతి, జ్ఞానాది గుణరహితం వస్తు కార్యకారణాత్మకం జడం, పరమేశ్వరాద్ భిన్నమ్, ఉపాసతే=అభ్యస్యంతి, తతః, భూయ ఇవ= అధిక మివ, తే, తమః = అజ్ఞానమ్, యే = పండితమ్మన్యమానాః, ఉ,

విద్యాయామ్=శబ్దార్థసంబంధ విజ్ఞానమాత్రే అవైదికే ఆచరణే, రతాః= రమమాణాః.

అన్వయః :- యే మనుష్యా అవిద్యా ముపాసతే తే ఽంధం తమః ప్రవిశంతి, యే విద్యాయాం రతా స్తు ఉ తతో భూయ ఇవ తమః ప్రవిశంతి.

భావార్థః :- అత్రోపమాలంకారః - యద్ యచ్చేతనం జ్ఞానాది గుణయుక్తం వస్తు తద్ జ్ఞాతృ. య దవిద్యారూపం తద్ జ్ఞేయమ్, యచ్చ చేతనం బ్రహ్మ విద్వ దాత్మస్వరూపం వా తదుపాసనీయం సేవనీయం చ. య దతో భిన్నం త న్నోపాసనీయం కిం తూపకర్తవ్యమ్. యే మనుష్యా అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశైః క్లేశైర్ యుక్తా స్తే పరమేశ్వరం విహాయాతో భిన్నం జడం వస్తూపాస్య మహతి దుఃఖసాగరే మజ్జంతి. యే చ శబ్దార్థాన్వయ మాత్రం సంస్కృత మధీత్య సత్యభాషణ పక్షపాత రహిత న్యాయాచరణరూపం ధర్మం నాచరం త్యభిమానారూఢాః సంతో విద్యాం తిరస్కృ త్యావిద్యా మేవ మన్యంతే తే చాధికతమసి దుఃఖార్ణవే సతతం పీడితా జాయంతే.

పదార్థము :- యే=ఎవరు, అవిద్యాం = అవిద్యను-జడవస్తువును, ఉపాసతే=ఉపాసింతురో, అభ్యసింతురో, అంధం, తమః = దృష్టి నడ్డగించు చీకటిని - అజ్ఞానమును, ప్రవిశంతి=పొందుదురు. యే=ఎవరు - ఏ పండితమ్మన్యులు, విద్యాయాం = శ బ్దా ర్థ సంబంధములను మాత్ర మెఱుగుట యనెడి యవైదికాచరణమున, రతాః=రమించువారో, తే, ఉ= వారును - వారుకూడ, తతః = అంతకంటె, భూయః ఇవ = ఎక్కువ, తమః = అజ్ఞానరూపమగు చీకటిలో ప్రవేశింతురు. (అనిత్యమును నిత్య మనియు, అశుచిని శుచియనియు, దుఃఖమును సుఖమనియు, అనాత్మను ఆత్మయనియు నెంచుట యవిద్య యనబడును. ప్రస్తుత మంత్రమున, జ్ఞానాది గుణరహితము, పరమేశ్వరునికంటె భిన్నమునైన జడవస్తువు అవిద్య యనబడినది.)

భావార్థము :- జ్ఞానాది గుణములతో గూడిన చేతనము జ్ఞాత యనబడును. అవిద్యారూపమగు జడవస్తువు జ్ఞేయము. విద్వాంసుల కాత్మరూపమగు చేతన బ్రహ్మము ఉపాసింపదగినది - ఉపాస్యము - సేవింపదగినదని భావము. ఆ బ్రహ్మమునకు భిన్నమైనది యుపాసింపదగినదికాదు. బ్రహ్మభిన్న పదార్థములవలన నుపకారము పొందవలయును. అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అను క్లేశములలో చిక్కుకొని పరమేశ్వరుని వీడి తద్భిన్నమగు జడవస్తువుల నుపాసించు మానవులు దుఃఖసాగరమున మునుగుదురు. మఱియు శబ్దార్థములు, వాని సంబంధము, అన్వయాదు లనెడి సంస్కృతాది భాషల నభ్యసించి, సత్యభాషణముచేయక, పక్షపాత శూన్య న్యాయాచరణ రూపధర్మము నాచరింపక అభిమానారూఢులై, విద్యను తిరస్కరించి, యవిద్యయందే మగ్నులై యుండి, మిక్కిలి దుఃఖములపాలయి పీడితు లగుదురు.

(అథ జడచేతనయోర్ విభాగ మాహ.)

జడ చేతనముల ఫలభేదము.

అన్య దేవాహుర్ విద్యాయా అన్య దాహు రవిద్యాయాః
ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్తద్ విచచక్షిరే. ౧3

పదార్థః :- అన్యత్ = అన్యదేవ కార్యం ఫలం వా, ఏవ, ఆహుః= కథయంతి, విద్యాయాః = పూర్వోక్తాయాః, అన్యత్ ఆహుః, అవిద్యాయాః=పూర్వమంత్రేణ ప్రతిపాదితాయాః, ఇతి, శుశ్రుమ = శ్రుతవంతః, ధీరాణాం = ఆత్మజ్ఞానాం విదుషాం సకాశాత్, యే, నః = అస్మభ్యమ్, తత్ = విద్యాఽవిద్యాజం ఫలమ్, ద్వయోః స్వరూపం వా, విచచక్షిరే= వ్యాఖ్యాతవంతః.

అన్వయః :- హే మనుష్యా ! యే విద్వాంసో నో విచచక్షిరే విద్యాయా అన్య దాహు రవిద్యాయా అన్యదే వాహు రితి తేషాం ధీరాణాం తద్వచో వయం శుశ్రు మేతి విజానీత.

భావార్థః :- జ్ఞానాది గుణయుక్తస్య చేతనస్య సకాశాత్ య ఉపయోగో భవితుం యోగ్యో న స అజ్ఞానయుక్తస్య జడస్య సకాశాత్, యచ్చ జడాత్ ప్రయోజనం సిధ్యతి న తచ్చేతనా దితి, సర్వైర్ మనుష్యైర్ విద్వత్ సంగేన విజ్ఞానేన యోగేన ధర్మాచరణేన చానయో ర్వివేకం కృత్వా ఉభయో రుపయోగః కర్తవ్యః.

పదార్థము :- యే = ఏ విద్వాంసులు, నః = మనకు, విద్యాయాః (ఫలమ్)=పూర్వోక్త విద్యకు ఫలము, అన్యత్ ఏవ=వేఱే, విచచక్షిరే= అని చెప్పిరో, అవిద్యాయాః=అవిద్యకు ఫలము, అన్యత్ ఇతి=వేఱనియు, ఆహుః=చెప్పియుండిరో, ధీరాణామ్ = ఆ యాత్మజ్ఞానులవలన, తత్ = ఉపర్యుక్తమగు నుపదేశమును, శుశ్రుమ=వినుచున్నాము.

భావార్థము :- జ్ఞానాది గుణయుక్తమగు చేతనము నుపాసించుటవలన లభించు ఫలము, అజ్ఞానాదియుక్తమగు జడము నుపాసించుటవలన గలుగదు. ఇట్లే జడోపాసనవలన గలుగు ఫలము చేతనోపాసనవలన గలుగదు. కావున మానవులు విద్వాంసుల సాంగత్యము, యోగము, విజ్ఞానము, ధర్మాచరణమునను వాని మూలమున జడచేతనములను వివేకించి వాని వలన లాభమును బొందవలయును.

(పునస్త మేవ విషయ మాహ.)
మరల నదే విషయము.

విద్యాం చావిద్యాం చ య స్తద్ వేదోభయగ్ం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే.౧౪

పదార్థః :- విద్యామ్ = పూర్వోక్తాం, చ = తత్సంబంధిసాధనోపసాధనమ్, అవిద్యామ్=ప్రతిపాదిత పూర్వామ్, చ=ఏత దుపయోగిసాధన కలాపమ్, యః, తద్, వేద = విజానీత, ఉభయమ్ సహ, అవిద్యయా= శరీరాది జడేన పదార్థసమూహేన కృతేన పురుషార్థేన, మృత్యుమ్=మరణ

దుఃఖభయమ్, తీర్త్వా = ఉల్లంఘ్య, విద్యయా = ఆత్మ శుద్ధాంతఃకరణ సంయోగ ధర్మ జనితేన యథార్థదర్శనేన, అమృతం=నాశరహితం స్వస్వరూపం పరమాత్మానం వా అశ్నుతే.

అన్వయః :- యో విద్వాన్ విద్యాం చావిద్యాం చ త దుభయం సహ వేద సోఽవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే.

భావార్థః :- యే మనుష్యా విద్యాఽవిద్యే స్వరూపతో విజ్ఞాయ అనయోర్ జడచేతనౌ సాధకౌ వర్తేత ఇతి నిశ్చిత్య సర్వం శరీరాదిజడం చేతన మాత్మానం చ ధర్మార్థ కామ మోక్షసిద్ధయే సహైవ సంప్రయుంజతే, తే లౌకికం దుఃఖం విహాయ పారమార్థికం సుఖం ప్రాప్నువంతి. యది జడం ప్రకృత్యాది కారణం శరీరాదికార్యం వా న స్యా త్తర్హి పరమేశ్వరో జగ దుత్పత్తిం, జీవః కర్మోపాసనే జ్ఞానం చ కర్తుం కథం శక్నుయాత్? తస్మా న్న కేవలేన జడేన న చ కేవలేన చేతనే నాథవా కేవలేన కర్మణా న కేవలేన జ్ఞానేన చ కశ్చిదపి ధర్మాదిసిద్ధిం కర్తుం సమర్థో భవతి.

పదార్థము :- యః = ఏ విద్వాంసుడు, విద్యాం = పూర్వ వర్ణిత విద్యను, చ=మఱియు దాని సాధనోపసాధనములను, అవిద్యాం=పూర్వము చెప్పబడిన యవిద్యను, చ = దాని కుపకరించు సాధన సముదాయమును, తత్=అ ధ్యాన గమ్య ధర్మమును, ఉభయం=ఈ రెంటిని; సహ = తోడ్తో, ఒకేసారి, వేద=తెలిసికొనునో, అతడు, అవిద్యయా=శరీరాది జడముల మూలమున చేసిన పురుషార్థమువలన, మృత్యుం=మరణ దుఃఖభయమును, తీర్త్వా=దాటి, విద్యయా = ఆత్మాంతఃకరణముల సంయోగమున నేర్పడిన ధర్మసహాయముతో గలిగిన యథార్థజ్ఞానరూప విద్యవలన, అమృతం = నాశరహిత స్వస్వరూపమును, లేక పరమాత్మను, అశ్నుతే = పొందును- అనుభవించును.

భావార్థము :- విద్యావిద్యల స్వరూపము నెఱింగి, వానికి చేతనము, జడము సాధకములని నిశ్చయించినవారు జడమగు శరీరమును, చేతనమగు

నాత్మను ధర్మార్థ కామ మోక్షములను సాధించుటకు నెల్లపుడు నుపయోగింతురు. అట్టివారు లౌకిక దుఃఖముల పాలుకాక పారమార్థిక సుఖమును బొందుదురు. జడమగు ప్రకృత్యాదికారణ పదార్థము, శరీరాది కార్యపదార్థములు లేనినాడు పరమేశ్వరుడు జగదుత్పత్తిని, జీవులు కర్మోపాసనా జ్ఞానములను ఎట్లు సాధింపగలరు ? కావున కేవల జడముతోకాని, కేవల చేతనముతోగాని, కేవల కర్మలతోగాని, కేవల జ్ఞానముతోగాని యెవరును ధర్మాదుల సిద్ధిని సాధింప సమర్థులు కాజాలరు.

(అథ దేహాంతే కిం కార్య మిత్యాహ.)

దేహత్యాగ సమయమున జేయవలసిన దేమి ?

వాయు రనిల మమృత మథేదగ్ం భస్మాంతగ్ం శరీరమ్,
ఓ౩మ్ క్రతో స్మర, క్లిబే స్మర, కృతగ్ం స్మర. ౧౭

పదార్థః :- వాయుః=ధనంజయాదిరూపః, అనిలమ్ = కారణరూపం వాయుమ్, అమృతం = నాశరహితం కారణమ్, అథ, ఇదమ్, భస్మాంతమ్ = భస్మ అంతే యస్య తత్, శరీరమ్ = య చ్ఛీర్యతే హింస్యతే తదాశ్రయమ్, ఓ౩మ్=ఏ తన్నామవాచ్య మీశ్వరమ్, క్రతో = యః కరోతి జీవః త త్సంబుద్ధౌ, స్మర=పర్యాలోచయ, క్లిబే=స్వసామర్థ్యాయ, స్మర, కృతమ్=య దనుష్ఠితమ్, తత్ స్మర.

అన్వయః :- హే క్రతో ! త్వం శరీరత్యాగసమయే ఓ౩మ్ స్మర. క్లిబే పరమాత్మానం స్వస్వరూపం చ స్మర. కృతం స్మర. అత్రస్థో వాయు రనిల మనిలోఽమృతం ధరతి. అ థేదం శరీరం భ స్మాంతం భవ తీతి విజానీత.

భావార్థః :- మనుష్యై ర్యథా మృత్యుసమయే చిత్తవృత్తిర్ జాయతే శరీరా దాత్మనః పృథగ్భావ శ్చ భవతి త థైవ వేదానీ మపి విజ్ఞేయమ్. ఏత చ్ఛరీరస్య భస్మాంతా క్రియా కార్యా, నాతో దహనాత్ పరః కశ్చిత్

సంస్కారః కర్తవ్యో వర్తమానసమయే ఏకస్య పరమేశ్వరస్యైవాజ్ఞా పాలన ముపాసనం స్వసామర్థ్య వర్ధనం చైవ కార్యమ్. కృతం కర్మ విఫలం న భవతీతి మత్వా ధర్మే రుచి రధర్మేఽప్రీతి శ్చ కర్తవ్యా.

పదార్థము :- క్రతో!=కర్మములనొనర్చు జీవ ! నీవు దేహావసాన సమయమున, ఓ౩మ్=పరమేశ్వరుని, స్మర = స్మరియింపుము, క్లిబే = స్వసామర్థ్యము కొఱకు, (పరమాత్మని), స్మర=స్మరియింపుము, కృతం= పూర్వము చేసినదానిని, స్మర=స్మరియింపుము, వాయుః = శరీరమునందలి ధనంజయాది ప్రాణవాయువు, అమృతం = కారణాత్మకమగు, అనిలం= బాహ్య వాయురూపమును (ధరించును), ఇదం శరీరమ్ = ఈ శరీరము, భస్మాంతం=భస్మము అంతముగా గలది - బూడిద - అగును.

భావార్థము :- మృత్యు సమయమున నెట్టి చిత్తవృత్తి యుండునో తెలిసికొనవలయును. అప్పుడు ఆత్మ శరీరమునుండి వేఱగు ననియు నెఱుంగ వలయును. అట్లే జీవన సమయమునను గుర్తింపవలయును. జీవుడు వెడలిపోయిన తరువాత శరీరమును దహించి భస్మముచేయవలయును. దాహకర్మ మొనర్చిన పిదప శరీరమునకు జేయవలసిన సంస్కారము లుండవు. జీవించినంత కాలము పరమేశ్వరుని యాజ్ఞను పాలించుచు నతని నుపాసించి, స్వసామర్థ్యమును పెంచుకొనవలయును. చేసినకర్మము నిష్ఫలముకాదని యెఱింగి, ధర్మమునందు రుచియు, అధర్మమునం దప్రీతియు గలిగి వర్తింపవలయును

(ఈశ్వరః కా ననుగృహ్ణా తీత్యాహ.)

ఈశ్వరు డెట్టి మానవులను కృపతో జూచును ?

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ. ౧౬

పదార్థః :- అగ్నే=స్వప్రకాశస్వరూప ! కరుణామయ! జగదీశ్వర!, నయ=గమయ, సుపథా=ధర్మ్యేణ మార్గేణ, రాయే=విజ్ఞానాయ ధనాయ వసుసుఖాయ, అస్మాన్=జీవాన్, విశ్వాని=అఖిలాని, దేవ=దివ్యస్వరూప, వయునాని=ప్రశస్యాని ప్రజ్ఞానాని (వయున మితి ప్రశస్య నామ. నిఘం-౩-౮. ప్రజ్ఞా నామసు. నిఘం. ౩-౯.) విద్వాన్=యః సర్వం వేత్తి సః, యుయోధి=పృథకుర్కు, అస్మత్=అస్మాకం సకాశాత్, జుహురాణమ్=కౌటిల్యమ్, ఏనః=పాపాచరణమ్, భూయిష్ఠామ్ = బహుతమామ్, తే=తుభ్యం, నమ ఉక్తిమ్ = సత్కార పురఃసరాం ప్రశంసామ్, విధేమ=పరిచరేమ.

అన్వయః: - హే దేవాగ్నే పరమేశ్వర ! యతో వయం తే భూయిష్ఠాం నమ ఉక్తిం విధేమ తస్మా ద్విద్వాన్ త్వమ్ అస్మ జ్జుహురాణ మేనో యుయో ధ్యస్మాన్ రాయే సుపథా విశ్వాని వయునాని నయ ప్రాపయ.

భావార్థః :- యే సత్యభావేన పరమేశ్వర ముపాసతే యథాసామర్థ్యం త దాజ్ఞాం పాలయంతి సర్వోపరి సత్కర్తవ్యం పరమాత్మానం మన్యంతే, తాన్ దయాలు రీశ్వరః పాపాచరణమార్గాత్ పృథక్ కృత్య ధర్మ్యమార్గే చాలయిత్వా విజ్ఞానం దత్వా ధర్మార్థ కామ మోక్షాన్ సాద్ధుం సమర్థాన్ కరోతి. తస్మాత్ సర్వ ఏక మద్వితీయ మీశ్వరం విహాయ కస్యాప్యుపాసనం కదాచి న్నైవ కుర్యుః.

పదార్థము :- దేవ!=దివ్య స్వరూపుడవు, అగ్నే!=ప్రకాశ స్వరూపుడవు నగు జగదీశ్వర!, తే=నీకు, భూయిష్ఠాం = అధికముగ, నమఉక్తిం=నమస్కారము, విధేమ=చేయుదుము, విద్వాన్ = సర్వము నెఱుగు నీవు, అస్మత్ = మా నుండి, జుహురాణం=కుటిలమైన, ఏనః = పాపాచరణమును, యుయోధి=వేఱుచేయుము, అస్మాన్ = మమ్ములను, రాయే = విజ్ఞాన ధనము, ధనమువలన కల్గు సుఖముకొఱకు, సుపథా ధర్మానుకూల

మార్గమున, విశ్వాని=సమస్తములైన, వయునాని = ప్రశస్త జ్ఞానములను, నయ=పొందునట్లు చేయుము.

భావార్థము :- ఎవరు సత్యభావముతో పరమేశ్వరు నుపాసింతురో, శక్తికొలది అతని యాజ్ఞలను పాలింతురో, అతనినే (సర్వోపరి) యందఱకంటె నెక్కుడుగ సత్కరింప దగినవాడని యెంచెదరో వారిని దయాలువగు పరమేశ్వరుడు పాపాచరణమునుండి వేఱుచేసి ధర్మమార్గమున నడపును. వారికి విజ్ఞానము గలుగజేయును. ధర్మార్థ కామ మోక్షములను సాధింప సమర్థులను జేయును. కావున అద్వితీయుడగు నా పరమేశ్వరుని దక్క యితరుల నెన్నడు నుపాసింపరాదు.

(అథాంతే మనుష్యా నీశ్వర ఉపదిశతి.)

అంతమున నీశ్వరుడు మనుజులకు ఉపదేశము చేయుచున్నాడు.

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్,
యోఽసా వాదిత్యే పురుషః
సోఽసా వహమ్ ఓ౩మ్ ఖం బ్రహ్మ. ౧౭

పదార్థః :- హిరణ్మయేన = జ్యోతిర్మయేన, పాత్రేణ = రక్షకేణ, సత్యస్య=అవినాశినః యథార్థస్య కారణస్య, అపిహితమ్ = ఆచ్ఛాదితమ్, ముఖమ్ ముఖవ దుత్తమాంగమ్, యః, అసౌ, ఆదిత్యే = ప్రాణే సూర్యమండలే వా, పురుషః=పూర్ణః పరమాత్మా, సః, అసౌ, అహమ్,ఓ౩మ్= యోఽవతి సకలం జగత్తదాఖ్యః, ఖమ్=ఆకాశవద్ వ్యాపకమ్, బ్రహ్మ= సర్వేభ్యో గుణకర్మ స్వరూపతో బృహత్.

అన్వయః :- హే మనుష్యాః। యేన హిరణ్మయేన పాత్రేణ, మయా సత్య స్యాపిహితం ముఖం (వికాశ్యతే), సోఽసావాదిత్యే పురుషో ఽస్తి సోఽసా వహం ఖం బ్రహ్మాస్మి ఓ౩మితి విజానీత.

భావార్థః :- సర్వాన్ మనుష్యాన్ ప్రతీశ్వర ఉపదిశతి. హే మనుష్యా! యోఽహ మత్రాస్మి స ఏ వాన్యత్ర సూర్యాదౌ, యోఽన్యత్ర సూర్యాదా వస్మి స ఏ వాత్రాస్మి, సర్వత్ర పరిపూర్ణః ఖవద్ వ్యాపకో న మత్తః కించి దన్యత్ బృహత్ అహ మేవ సర్వేభ్యో మహా నస్మి, మదీయం సులక్షణం పుత్రవత్ ప్రాణప్రియం నిజస్య నామ ఓ౩మితి వర్తతే. యో మమ ప్రేమ సత్యాచరణ భావాభ్యాం శరణం గచ్ఛతి త స్యాంతర్యామి రూపే ణాహ మవిద్యాం వినాశ్య తదాత్మానం ప్రకాశ్య శుభ గుణ కర్మ స్వభావం కృత్వా, సత్యస్వరూపాచరణం స్థాపయిత్వా శుద్ధం యోగజం విజ్ఞానం దత్వా, సర్వేభ్యో దుఃఖేభ్యః పృథక్కృత్య మోక్షసుఖం ప్రాపయా మీత్యో౩మ్.

పదార్థము :- హిరణ్మయేన = జ్యోతి స్వరూపుడను, పాత్రేణ = రక్షకుడను నగు నాచే, సత్యస్య = నాశరహితమగు యథార్థ కారణము యొక్క, అపిహితం = కప్పబడియున్న, ముఖం=ముఖతుల్యమగు నుత్త మాంగము ప్రకటము చేయబడును, యః, అసౌ = ఆ ప్రత్యక్ష రూపుడగు, ఆదిత్యే=ప్రాణమునందో, లేక సూర్యునందో, పురుషః = పూర్ణుడగు నే పరమేశ్వరు డున్నాడో, సః అసౌ = ఆయా, అహమ్=నేను, ఓ౩మ్= జగద్రక్షకుడను, ఖమ్=ఆకాశమువలె వ్యాపకుడను, బ్రహ్మ = గుణకర్మ స్వభావములనుబట్టి అన్నిటికంటె నధికుడను నై యున్నాను.

భావార్థము :- పరమేశ్వరుడు మనుజులనుద్దేశించి యిట్లుపదేశించు చున్నాడు: "ఇక్కడ నెల్లయెడల నున్న నేనే సూర్యాదిలోకములందు నున్నాను. సూర్యాదిలోకములం దంతటనున్న నేనే యిక్కడను ఉన్నాను. ఆకాశమువలె నంతటను వ్యాపకుడనై యున్న నన్ను మించిన వస్తువొండు లేదు. నే నన్నిటికంటె గొప్పవాడను. సులక్షణయుక్త పుత్రునివలె నెవడు ప్రాణప్రియమగు నా నామము "ఓ౩మ్"ను భక్తితోను, సత్యాచరణముతోను శరణుచొచ్చునో అంతర్యామి రూపమున నే నతని యవిద్యను నశింప

జేయుదును. అతని యాత్మను ప్రకాశింపజేయుదును. శుభ గుణ కర్మ స్వభావయుక్తు నొనరింతును. సత్యస్వరూపమగు నాచరణమును స్థిర మొనర్చి, శుద్ధమగు యోగజధర్మమును ప్రసాదించి, సర్వదుఃఖములనుండి యతని వేఱుచేయుదును. మోక్షానందమును గలుగ జేయుదును.''

అ త్రేశ్వర గుణకర్మ వర్ణన మధర్మత్యాగోపదేశః సర్వదా సత్కర్మానుష్ఠానావశ్యకత్వ మధర్మాచరణనిందా పరమేశ్వర స్యాతిసూక్ష్మస్వరూప వర్ణనం విదుషాం విజ్ఞేయత్వ మవిదుషా మవిజ్ఞేయత్వం సర్వ త్రాత్మభావే నాహింసా ధర్మపాలనం తేన మోహశోకాదిత్యాగ ఈశ్వరస్య జన్మాది దోష రాహిత్యం వేదవిద్యోపదేశనం కార్యకారణాత్మకస్య జడ స్యోపాసననిషేధ స్తాభ్యాం కార్యకారణాభ్యాం మృత్యుం నివార్య మోక్షసిద్ధికరణం జడవస్తున ఉపాసన నిషేధ శ్చేతనోపాసనవిధి స్తదుభయ స్వరూప విజ్ఞానావశ్యకత్వం శరీర స్వభావ వర్ణనం సమాధినా పరమేశ్వర మాత్మని నిధాయ శరీరత్యాగ కరణం శరీరదాహా దూర్ధ్వ మన్యక్రియానుష్ఠాన నిషేధోఽ ధర్మత్యాగాయ ధర్మవర్ధనాయ పరమేశ్వర ప్రార్థన మీశ్వర స్వరూపవర్ణనం సర్వేభ్యో నామభ్య ఓ౩మ్ ఇత్యస్య ప్రాధాన్యప్రతిపాదనం చ కృత మత ఏతదర్థస్య పూర్వాధ్యాయోక్తార్థేన సహ సంగతి ర స్తీతి వేద్యమ్.

ఈ యుపనిషత్తు (యజుర్వేదపు నలువదియవ యధ్యాయము) నందు వర్ణింపబడిన విషయములను దయానంద మహర్షి సంక్షేపముగ నిట్లు నిర్దేశించుచున్నాడు :

ఈశ్వరగుణ వర్ణనము, అధర్మ త్యాగోపదేశము, ఎల్లపుడు సత్కర్మానుష్ఠానావశ్యకత్వము, అధర్మాచరణనింద, పరమేశ్వరుని అతిసూక్ష్మ స్వరూపవర్ణనము, విద్వాంసులకు జ్ఞేయత్వము, అవిద్వాంసులకు అజ్ఞేయత్వము, అన్ని ప్రాణులయెడ నాత్మభావముతో నహింసాధర్మమును పాలించుట, తన్మూలమున మోహశోకాదులను త్యజించుట, ఈశ్వరునకు జన్మాది దోషములు లేకుండుట, వేద విద్యోపదేశము, కార్యకారణాత్మక

జడోపాసన ని షే ధ ము, ఆ కార్యకారణముల మూలమున మృత్యువును దొలగించుకొని మోక్షమును సంపాదించుట, జడవస్తూపాసన నిషేధము, చేతనోపాసనవిధి, తదుభయ (జడచేతన) స్వరూపవిజ్ఞానావశ్యకత, శరీర స్వభావవర్ణనము, సమాధిమూలమున పరమేశ్వరుని నాత్మయందు నిలిపి శరీరమును త్యజించుట, శరీర దాహానంతరమున అన్యక్రియానుష్ఠానముల నిషేధము, అధర్మత్యాగమునకు, ధర్మమును వృద్ధిచేయుటకు పరమేశ్వర ప్రార్థనము, ఈశ్వర స్వరూప వర్ణనము, పరమేశ్వరునకు గల నామము లన్నింటికం టెను 'ఓ౩మ్' అను నామ ప్రాధా న్యోపపాదనము, అను నీ విషయము లన్నియు నీ యధ్యాయమున ప్రతిపాదింపబడినవి. పూర్వా ధ్యాయములందు వర్ణిత విషయములతో వీనికి సంగతి యెంతయు నున్నట్లు తెలియదగు నని మహర్షి యభిప్రాయము.

ఇతి శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యాణాం శ్రీ పరమ విదుషాం
విరజానంద సరస్వతీస్వామినాం శిష్యేణ, శ్రీ మద్దయానంద
సరస్వతీ స్వామినా, నిర్మితే సంస్కృతార్య భాషాభ్యాం
సమన్వితే సుప్రమాణయుక్తే యజుర్వేదభాష్యే,
చ త్వా రిం శ త్త మో అ ధ్యా యః
స మా ప్తః

యజుర్వేదమునందలి అంతిమ (౪౦ వ) యధ్యాయ రూపమగు
ఈశావాస్యోపనిషత్తునకు పండిత గోపదేవ విరచిత-
ఆం ధ్ర టీ కా తా త్ప ర్య ము
స మా ప్త ము

ఓమ్ తత్ సత్

ఓ౩మ్

# విశేష వివరణము

స్వా. గురుదత్త విద్యార్థి, ఎం. ఏ.

" ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః "

నేడు మనము వైజ్ఞానిక యుగమున జీవనము గడుపుచున్నాము. రాకెట్లను నిర్మించి వానిపై నారూఢులమై, అంతరిక్షమున భూమిని చుట్టి తిరుగ నేర్చితిమి. సమీప గ్రహములంజేర నుద్యమించుచున్నాము. ప్రాకృతిక శక్తులతో చెలగాటము లాడుచున్నాము. నేటి మానవుని బుద్ధివికాసము విభ్రాంతిజనకము. ఇందు సంశయ మిసుమంతయు లేదు. కాని, ప్రస్తుత మానవుడు ధర్మము నర్థము చేసికొనజాల కున్నాడు. అర్థము చేసికొనినంత వఱకైనను విపరీతముగ జేసికొనుచున్నాడని చెప్పవలసి వచ్చుచున్నది. కావుననే విజ్ఞాన యుగమున నడయాడు నేటి మానవుని జీవనము నందును, నిత్యాచరణముననుక్రూరత క్రీడించుచున్నది. దుర్దమనీయమైన మనోవికారము, ప్రబల విద్వేషము ప్రకటమగుచున్నవి. అతడు క్షమింపరాని తప్పిదముల నొనర్చుచున్నాడు. నేటి మానవుని హృదయము కరుణాహీనమయి యున్నది. అట్టి హృదయమునుండి వెలువడు బుద్ధిపూర్వకములుకాని చేతనా రహితములైన కృత్రిమ ప్రార్థనలు ధర్మముగా నెంచబడుచున్నవి. సంఘ భీతితో విధిలేక యాచరించు వ్యవహారములు, ధనమును, శక్తిని, సమయమును నష్టముచేసి యాచరించు నిష్ఫలానుష్ఠానములు ధర్మపదవాచ్యములైనవి. పురోహితులు, సాంప్రదాయికులు నేర్పఱచిన మానవ సంఘములోని పరస్పర వైషమ్యము పరమేశ్వర నిర్మితముగా నెంచబడి, ధర్మమనబడుచున్నది. పాపములతోను, దుఃఖములతోను, నపరాధములతోను, రక్తపాతము నొనర్చు యుద్ధములతోను నేటి మానవుడు ప్రపంచమును

నింపుచున్నాడు. పారస్పరిక ఘృణ, ద్వేషము, ప్రతిహింస, యుచ్చాకాంక్ష మున్నగు గుణసంపదలతోను, స్వార్థపరతతోను, నసహిష్ణుతతోను ధర్మము కలుషితమై పోయినది.

బుద్ధియందు తర్కము, హేతువాదము, భక్తి కనిపింపవు. మతములయు, సంప్రదాయములయు వ్యవసాయములే నేడుధర్మపర్యాయములైనవి. జీవనస్థాయిని బెంచుటయే శ్రద్ధ యనబడుచున్నది. పెద్దపెద్ద మాటలను జెప్పుటయే కర్మాచరణమైనది. మూఢ విశ్వాసములు, పురాణ ప్రవచనములు బ్రహ్మాండ రహస్యములను బ్రకటించునవిగా నెంచబడుచున్నవి. యథార్థత, నిశ్చయము అనపేక్షితములయినవి, స్వప్నములు సంఘమున సత్యములుగా నెంచబడుచున్నవి. చమత్కారములను, అస్వాభావిక సిద్ధాంతములను నిరూపించుటకు కల్పనాశక్తి యుపయోగింపబడుచున్నది. మానవ ప్రకృతిని భ్రష్టముచేసి, యది కళంకితము, నవమానితము, నిందితముగ నెంచబడుచున్నది.

ఎందరో ప్రతిభావంతులైన విద్వాంసులు, పరమేశ్వరుని కృపకు పాత్రులగుట వలన నిర్మలబుద్ధిని బొందినవారై ధర్మముయొక్క వాస్తవిక రూపమును గుర్తించుచు నధర్మమును రూపుమాప యత్నించి యుండిరి. కాని, నేటికిని వాస్తవిక ధర్మమువలన నేర్పడు శ్రేష్ఠభావనలు సత్యాన్వేషకులకు ప్రపంచమున లభించుట సులభముగాదు.

ఇంతకంటె శోచనీయమగు దశ యింకొకటి యున్నదా? ఇంతకంటె శ్రేష్ఠమగు స్థితి సంభవము కాదా! జీవన రహస్య మింతేనా? అయినచో వస్తువుల వాస్తవికత దెలిసికొనుట మానవునకు అందరాని పండనవలసి వచ్చును. అటులయిన మానవ జీవనము శోకమయమగును. ప్రాపంచిక బాధలు మానవుల కొకనా డసహ్యము లగును.

కాని, వాస్తవిక ధర్మము నెఱిగిననా డవియన్నియు నుండవు. సత్యధర్మమున కృత్రిమతకు తావులేదు. కపటరచన లందుండవు. సత్యధర్మము

కేవలము మాటలతో జెప్పునదియే కాదు. అది యందరాని ఫలముకాదు. అది జీవనసారము. అయ్యది వ్యావహారికము. ధర్మము శుద్ధమగు సత్యము మీద నాధారపడియుండును. సర్వశక్తులు సమానముగ వికసించుటయే ధర్మమున కాధారము. మానవులు తమ (సత్తా) యునికిని గుర్తించుటకుగాను తమ క్షమత (ఓర్పు)ను సరిగా విస్తరింపజేయుటయే ధర్మమగును ఈశ్వర నియమానుకూలముగ తమ జీవితమ్మును నడుపుటయే ధర్మము-సత్యధర్మము అనబడును. ''ప్రపంచమున నేర్పడు పరిణామములకు కారకుడు పరమేశ్వరు డొకడున్నాడు. ఆ పరిణామములను మనమెట్లు సృష్టింపగలము?'' అని తమతోబాటు నెల్లవేళల, నెల్లయెడల నా పరమేశ్వరుని యునికిని గుర్తించుటయే ధర్మము విషయమున నేర్చుకొను ప్రథమ పాఠము.

''విశ్వమున గోచరమగు ప్రాకృతికము లయిన స్థిరనియమములు, అనల్ప శక్తులు, వాని యనంత రూపములు, దృశ్య చమత్కారములు నన్నియు నాకస్మికములు గావు. వీని కన్నింటికి నాధారముగ విశ్వవ్యాప్తమైన జ్ఞానమయ మూలతత్త్వమొండు గలదు.'' అను భావనయే ధర్మమున కారంభకము. ఆ మూలతత్త్వమును సాక్షాత్కారము జేసికొనిన వ్యక్తి ఆనందభరితుడై ''ఈ బ్రహ్మాండమున పరమాణువు మొదలు ఎల్ల పదార్థములు, ఎల్లలోకములు చేతనాధిష్ఠితములు, వ్యాపక పరమేశ్వరుడు వీని కాధారము అని ఉద్ఘోషించును. అప్పుడే యతడు ధర్మక్షేత్రమున ముందంజ వేయవాడగును. తన్నుదా సంస్కరింప బూనుకొనును. క్షణికములయిన ప్రాకృతిక రూపములను, దృశ్య చమత్కారములను భేదించి, అందు వ్యాప్తమైయున్న ప్రకృతిపాలకుని, విశ్వంభరుని, నెఱుగనంతవఱకు మానవుడు తనను సంస్కరించుకొన ననువగు శిక్షణను బొందజాలడు.

ప్రకృతి తన నశ్వర ప్రలోభనములను, క్షణికములగు సౌందర్యములను విశ్వమున నలుగడల వెదజల్లుచుండును. మానవుడు దాని మోహకములగు నాకర్షణములకు, ఉచ్ఛృంఖలము లయిన ప్రలోభనములకు

సులభముగ లోబడును. విశ్వమును నిర్మించి, యందలి ప్రత్యణువునందును శయనించి వ్యాపకుడై యున్న పరమేశ్వరుని గుర్తింపడు. మానవుని మనస్సు వికసితముకాక, అసంస్కృతమైయున్న దశలో నతడు శీఘ్రముగ నింద్రియ గ్రాహ్యములగు దృశ్య చమత్కారములలో జిక్కువడును. ధన సంపదలు, సముజ్జ్వల వైభవము, కులీనత, పదవీ వ్యామోహము, ఉచ్ఛృంఖలము లయిన యింద్రియ పరవశత మున్నగునవన్నియు యువకులను, సాధారణ మానవులను నాందోళితులం జేయును. ఈర్ష్య. పాపము, ఘృణ, స్పర్ధ, క్రోధము మున్నగు వికారములకు లోబడజేయును. మానవు డిట్లు తన నిత్యజీవనస్వార్థములను, సాధించుటకు అంధుడై ప్రవర్తించును. అందువలన నతడు మానవ జీవనమున ననుభవింపవలసిన సత్యమగు నానందము ననుభవింపజాలడు. ఈ యద్భుత జగత్తును సృష్టించి, దానియెడ మమత్వము లేక బ్రహ్మాండమున నంతట వ్యాపించియుండు పరమేశ్వరుని యౌదార్యమును నిత్యము గాంచు భక్తుడే యానందమూ ననుభవింపగలడు. కావున నీ ప్రపంచము శాశ్వతము కాదనియు, ఇంద్రియ సుఖములు చిరస్థాయిగలవి కావనియు, ఐహిక జీవనము ఫలింపని యుద్యానవనమనియు, నీ యైహికములగు నుపాధులు, పదవులు. ప్రతిష్ఠలు నన్నియు నశ్వరము లనియు మానవుని స్మరణకు దీసికొనివచ్చుట యెంతయు నవసరము. నశ్వర పదార్థములను ప్రేమించి, వానియందు తగుల్కొని యుండుట శ్రేయః సాధనము కాదు. సనాతనము, నిత్యమునగు పరమ పదార్థమునందే ధ్యాన ముంచవలయును. ఆ పరతత్త్వమునే ప్రేమించవలయును. మానవుని యాకాంక్షల కదియే విషయము, లక్ష్యము కావలయును. అప్పుడే నిజమైన యానందము లభించును.

ప్రాపంచిక పాపములనుండియు, ఆడంబరములనుండియు, ప్రపంచ మాయనుండియు దూరముగ నుండదలచెదవేని, ఈర్ష్య, క్రోధము, మాత్సర్యము, ద్వేషము మున్నగు దుర్గుణములనుండి విడివడ దలంచెదవేని,

నిర్మలము నిత్యమునగు సుఖశాంతుల ననుభవింప గోరుదువేని, "మానవ! ఈ నశ్వరములైన ప్రాపంచికపు టాలోచనలను విడిచి నిర్మల సుఖము ననుభవింపుము!"

ఈ ప్రపంచము మూలముననే పరమేశ్వరుని జేరుటకుగాను ప్రపంచ నశ్వరతను గూర్చి యాలోచింపవలయును. దానియందు మమత్వమును గూడ విడువవలయును. ఈ స్థితిని సంపాదించి, యటుపై నొక యడుగు ముందుకు వేయవచ్చును. అప్పుడు వ్యక్తిగత పాపముల నుండి మానవుడు నివృత్తిని బొందగలడు. ఈ పాపనివృత్తి న్యాయానుభవముమీద నాధారపడి యుండును. మానవ ప్రవృత్తియందు న్యాయనియమము బాగుగ నాటుకొని యున్నది.

'వ్యాపకము, విజ్ఞమునగు దివ్యదృష్టితో నొక దివ్యతత్త్వము ఎల్లరకు నత్యంత శుభము నొనర్చు నుద్దేశముతో నెల్లరను శాసించుచున్నది.' ఈ దివ్యతత్త్వమే పరమాణువు మొదలు పెద్దపెద్ద సూర్యగోళములవఱకు గల పదార్థముల కన్నింటికి జీవన దాన మొసంగుచున్నది. అవి చేయుపనులకు తగినట్లు వానిని రూపొందించుచున్నది. అందువలననే యెల్లరకు శుభము కలుగుచున్నది.

ఎల్లరు నాత్యంతిక సుఖము నుద్దేశింతురు. ఈ యుద్దేశమును నెఱవేర్చుట కనుకూలముగ నీశ్వరుడీ బ్రహ్మాండమున వ్యవస్థ నొనర్చి యున్నాడు. సనాతనములు, నవికార్యములునగు ప్రాకృతిక స్థిరనియమములే ఆ యపూర్వ వ్యవస్థను బోధించు సంహిత లనదగియున్నవి. అయ్యవి యీశ్వరుని యునికిని బోధించు విశ్వాసములు. ఎల్లరను నియమము లందును, శాసనమునందును నుంచు సనాతన బ్రాహ్మీ విధులు. ప్రతివ్యక్తి యొనర్చు కర్మములను లిఖించుటకు పరమేశ్వరునిచే నియమింపబడిన కపటులు, లంచగొండులునగు రక్షకభటు లెవ్వరును నీ ప్రపంచమున లేరు.

అట్లుండు పక్షమున పరమేశ్వరునిచే పాలింపబడు ప్రజల వ్యాపకశాంతి కెన్నడో భంగము కలిగియుండెడిది. ఈశ్వరీయ సంస్థలో నట్టి దుర్బలత యెన్నడు రాజాలదు. ప్రతి వ్యక్తికి సంబంధించిన స్మృతియే వాని కర్మము లను లిఖించుచుండును. అయ్యది నిర్భ్రాంతము. ప్రతివానికి సుఖదుఃఖ ములను గ్రహింపజేయు విచక్షణమయిన యింద్రియ విన్యాసమే పరమే శ్వరుని వ్యాపక రక్షక భటశ్రేణి. ఈ రక్షకుల కర్తవ్యము అపరాధిని దండించుట కాదు. శిక్షణ ద్వారమున నతనిని సంస్కరించుటయే యగును. అభియుక్తుల యభియోగములను నిర్ణయించుటకు పరమేశ్వరుని న్యాయస్థాన ములు వేఱుగ లేవు. సామాజిక సంవేదనము, హార్దిక భావములు, అన్యచిత్త క్షోభలు నను మానసికవృత్తులే న్యాయాలయములు. వానిలో తర్కము ఎల్లప్పుడును నాలోచన మనెడి సింహాసనమున నారూఢమై యుండును. ప్రకృతి సంస్థలో నీ వ్యవస్థ యెల్లయెడల ప్రయుక్తమగుచుండును. ఆత్యం తిక శ్రేయస్సు దీని కుద్దేశమగుటవలన నీ ప్రకృతి సంస్థలో నుండు వ్యవస్థ యెల్లరి సమష్టి యున్నతిలో వ్యక్తియున్నతి యిమిడియుండునట్లు చేయబడి నది. అందువలననే ప్రకృతి యొక్క సనాతనములు, స్థిరములునగు నియమ ములు వ్యక్తిగతమగు నధికారములను వేఱుగ నంగీకరింపవు. వ్యక్తుల నవి పూజింపవు కూడ. ప్రాకృతిక తరంగము లొకేదిశకు ప్రవహించును. ఆ దిశ-మార్గము-జన కల్యాణము. అంతకంటె వేఱేమియు లేదు. ఈ సామాన్యక్రమము నుల్లంఘించు వ్యక్తి యపరాధి యగును. అపరాధఫలము ననుభవింపక తప్పదు.

కాని, పరమేశ్వరునిచే నెల్లరికొఱకు నేర్పఱచిన నియమమును, వ్యవస్థతో గూడిన మార్గమును బుద్ధిపూర్వకముగ గ్రహించువాని స్థితి భిన్నముగ నుండును. అతడు నడుచు మార్గము మొదట కొంచెము కఠినముగా దోచినను, నతని కా మార్గము వ్యక్తిగతమగు నానందమును జేకూర్చును. సామాజికాభ్యుదయమును గలిగించును. సుఖశాంతులను

బడయజేయును. ఈర్ష్య, అంతర్దాహము, స్పర్ధ, తిరస్కారము అసంతోషము, నిరాశ, నిష్ఫలత మున్నగువాని కా మార్గమున తావుండదు. అతనికి తన స్థితిగతులలో నసంతృప్తి కలుగదు. ధర్మమార్గమునుండి యతడు విచలితుడు కాదగు స్థితి యెన్నడు నేర్పడదు. అతని వ్యక్తిగత స్వాస్థ్యమునకుగాని, అస్తిత్వమునకుగాని భంగము వాటిల్లదు. పై పెచ్చు అతనిలో సాంఘికభావము, భ్రాతృభావము పెంపొందును. అతని నిఃస్వార్థ ప్రకృతి యతనిని సాధారణ దుఃఖములనుండి యుద్ధరించి, స్వార్థపరతనుండి దూరముచేయును. అతని తర్కము నిర్మలము, సంకల్పము శుద్ధము - పవిత్రము నగును. సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు మనకు చుట్టునుండు ననంత బ్రహ్మాండకృత్యములను వ్యాపక నియమముల ద్వారమున క్రమబద్ధము చేయుచున్నాడని యొకమాటు గుర్తించిన మానవుడు - వ్యాపక నియమములను బాగుగ గుర్తించిన మానవుడు తన హృదయాంతర్గతమున పరమేశ్వరుడు నిండియున్న ట్లనుభవించును. అతడెన్నడును పరమేశ్వ రానుభూతిని మఱవడు. ఇతరాత్మలతో తన యాత్మకుగల సామ్యమును గుర్తించును. అప్పు డతనికి సర్వమానవులయెడ నిజమైన భ్రాతృభావ మేర్పడును. అతనికి నాడు పరుల నానందింపజేయుటలో తన కానందము గలుగుననియు, పరులను సుఖియింపజేయుటలో తనకు సుఖము గలుగుననియు బోధపడును.

సార్వత్రిక న్యాయమును గుర్తించు మనుజుడు ఇతరుల యధికారములకుగాని, స్వాధీనతలకుగాని భంగము కలిగింపడు. సార్వత్రిక న్యాయము మనుజునకు ''మానవు లెల్లరు తనకు సోదరు'' లని తెలుపును తన స్వార్థసిద్ధిలోను, కర్తవ్య నిర్వహణములోను పరులతో నేకరసతను సంపాదింప మనుజున కా న్యాయము బోధించును. అట్లు కానినాడు జనకల్యాణమునకు దారితీయు ప్రాకృతిక నియమముల గతికి భంగము కలిగించిన ట్లగును. కావున సార్వత్రిక న్యాయసూత్రముల ననుసరించు వ్యక్తియే యథార్థముగ

"పరుల ధనమునకు లోభపడకు" మని యుపదేశింప గలుగును. అప్పుడే యతనిలో వ్యక్తిగత సంస్కారము సంభవమగును.

కాని, ధార్మికోన్నతి యింతటితోనే సమాప్తముకాదు. ఐహికదుఃఖములనుండి తన్ను దా నుద్ధరించుకొనుట యన నొక విధముగ ప్రపంచమున గోచరించు నశ్వర చమత్కారములచేతను, వృథాడంబరములచేతను తాను ప్రభావితుడు కాక, పరుల యధికారములకును, స్వాధీనతలకును భంగము కలిగింపకుండుటయే యగును. ఇది ధర్మమున నొక భాగము. నిషేధాత్మక పక్షము. ఇందువలన మనుజుడు పాపముచేయుట కుద్యమింపడు. ఉదాసీనత వహించును. ఉపేక్షను గలిగించు స్తబ్ధత యతనిలో నేర్పడును. కాని, ధర్మ మింతటితో చరితార్థము కాదు. అది కేవలము నిషేధాత్మకము కాదు. ప్రబలమగు నోజస్సుతో గూడి, ఉత్సాహవంతములగు క్షమతలతో జేరి, అద్భుతములను నిర్మించు కోరికలు మనుజునిలో నుండును. అయ్యవి యున్నత ప్రయోజనముల యస్తిత్వమును నిర్దేశించును. కేవల నిషేధాత్మక నీతులతో నయ్యవి యుపశమింపవు. మనుజునిలో కర్మముల నొనర్పనభిముఖునిగా జేయు శక్తులు, స్వభావసిద్ధమైన క్షమతలు, ఉత్తేజక తత్త్వములు నెన్నో యున్నవి. అయ్యవి వ్యర్థములు కారాదు. అయ్యవి మానవుని తోటిమానవుల కొఱకు సుఖశాంతుల నొడగూర్పదగు యశస్కర ప్రయోజనముల సాధింప నుద్యమింపజేయును. అతని శారీరిక, మానసిక శక్తుల నందుల కుపయోగింప ననవరతము నియోగించుచుండును. ప్రకృతి నియమము ఉద్యోగమేకాని, యలసతకాదు. జడ చేతనాత్మకమగు నీ విశ్వమునందంతటను, ఉత్సాహము, బలము, అదమ్యమగు నుల్లాసము నిండియుండుటను మనము చూచుచున్నాము. పదార్థమేదియు, నిరుద్యమముకాదు. చీమలు సదా కార్యమగ్నములై యుండుట చూడనగును. మనము నివసించు భూమి నిరంతరగమనశీలమై యున్నది. వాయువు నిరంతరము పరుగిడుచున్నది. లతలు నిత్యము తమ యభివృద్ధికై ప్రాకులాడుచుండును. జలము సదా

ప్రవహించుచుండును. మనకు నలుగడల వ్యాపించియున్న విశ్వమును దిలకింతుమేని మనకేమి బోధపడును ? ఈ విశ్వమున నెక్కడ జూచినను అంతర్నిహిత ప్రాకృతిక శక్తులు తమ యుపస్థితిని వెల్లడింప నెల్లప్పుడు ప్రయత్నించుచున్నట్లు గనిపింపదా ?

ఈ విశ్వము కేవల మొక ధర్మమునే యుపదేశించును. వ్యక్తి యొక్కయు, సమష్టి యొక్కయు సుఖము, స్వాస్థ్యము, శుభము, సద్గతి మున్నగువాని ప్రాప్తికి నిరంతరము కర్మముల నాచరించుటయే యాధర్మము. అందువలననే వేద ముపదేశించుచున్నది.

"మానవ ! ఉత్తమ కర్మముల నొనర్చుచు, నూఱు సంవత్సరములదనుక నిరుగుపొరుగు వారితో శాంతముగ జీవింప గోరుము. అప్పుడే కర్మములు నిన్ను దూషితు నొనర్పవు. మఱియొక మార్గము తరించుటకు లేదు."

ప్రయోజనవంతమై, వ్యవసాయయుక్తమై యొప్పు జీవనమును నిరంతరము గడపు మానవున కీ ప్రపంచ మెంత సుందరమో వర్ణింపనలవి కాదు. ఈ విశ్వము ఆనందమునకు నిలయము, సుఖసంపదలకు గని. దీనిని త్రవ్వి యా సుఖసంపదలను వశము జేసికొనవలసి యున్నది.అందుల కుపయోగించు మానవీయ కార్యశక్తు లెయ్యవి ? మానవునిలో నున్నవాణి యతనిని సుఖవంతునిజేయును. కృతార్థు నొనర్చును. సంగీతము శాంతి నొసంగును. ఎప్పటికప్పుడు ఉత్సాహవంతు నొనర్చును. మానసిక ధర్మములు మానవు నున్నతుని జేయును. మానవునకు లభించిన ప్రతి ఇంద్రియము పవిత్రము, నిర్మలము నై యున్నది. దానివలననగు కార్యము మిక్కిలి శ్రేష్ఠమైనది. మానవరచనలో నున్న యీ సౌందర్యమును ప్రశంసించుచు, దీని మహత్వమును గుర్తించుచు, దీని పవిత్రత నర్థముచేసి కొనుచు, దీని శుద్ధిని కామించు వ్యక్తి యప్రియుడుకాని, అసంగతుడుకాని, సౌందర్యరహితుడుకాని కాగలడా ! ఎన్నడును కా జాలడు. అత డాంతరిక

శుద్ధిలో నుండు సౌందర్యమును గుర్తించిన మీదట, అంతర్వర్తి పుణ్య శీలతాదీప్తి నాలోకించిన మీదట, కలుషితమైన విషయాసక్తికి లోబడి, నీతిరహితుడై, నరకమున నెట్లుండగలడు? అతడు ప్రయోజనములోనున్న పవిత్రతను, కర్మములోగల సాధుత్వమును జీవనసౌందర్యమును నన్నింటి కంటె మిక్కిలిగ ప్రేమించును. అత డీ యాంతరిక సౌందర్యములను నాశ మొనర్చి తన్ను దా పతితునిగా జేసికొనడు. అతడు "ఆత్మ పావిత్ర్యమును నష్టము జేసికొను వారు నిశ్చయముగ మరణించిన తదుపరి కూడ చెడ్డ జీవులు నివసించు అంధకార పూర్ణమగు లోకములను జేరుదు" రను సత్యమును గుర్తించును. అతడు పరమేశ్వరునిచే తన కొసంగబడిన తర్కశక్తికి కృతజ్ఞతను వెల్లడించును. తనకు ప్రదానము చేయబడిన నైతిక శీలమునకు ధన్యవాదముల నొనర్చును. అతని యాత్మ కృతజ్ఞతా భరితమై, యీశ్వరుని వంకకు మరలును.

'ఈశ్వరుడు అనంతుడు. అంతటను వ్యాపించియుండును. యుగ యుగాంతరములలో జీవులొనర్చు కర్మములకు ఫలవ్యవస్థ చేయుచుండును.' కృతజ్ఞుడయిన మానవున కీ విశాల బ్రహ్మాండమున సామ్రాజ్య మొనర్చి పరమేశ్వరుని గుణానువాదము సేయని పదార్థమొండైన కనిపించునా? అందువలననే పరమేశ్వరునియెడ కృతజ్ఞతను వెల్లడించుచు, ఫలానుభూతిలో తమ పరాధీనత నంగీకరించుచు, మన యాత్మలన్నియు నా పరమేశ్వరుని వంకకే పరుగిడుచున్నవి. 'ఆ పరమేశ్వరుడు నిత్యుడు, సనాతనుడు, సర్వ జ్ఞుడు, వ్యాపకుడు, మనస్సుకంటె నధిక శక్తిశాలి.'

భౌతికములగు నింద్రియము లతనిని గ్రహింపజాలవనుట సత్యము. కాని, హృదయ మతనివంక కంజలువేయగలుగును. మనోహరములగు శబ్దస్పర్శ రూపరసగంధములు, బాహ్య సంస్కారములు ప్రపంచ ప్రలోభ నములకు లోబడిన సామాన్య మనుజుని పరమేశ్వరునకు దూర మొనర్చును. కాని, యెవని యాత్మలో పరమేశ్వరుని దివ్య సౌందర్య కుసుమము వికసింప

నారంభించునో యెవని హృదయము కృతజ్ఞతాభావ భరితమై యుండునో వా డీ ప్రాపంచిక పదార్థములను భేదించి వానియందు నిహితమయి యున్న పరమేశ్వరుని సాక్షాత్కారము జేసికొనక విరమింపడు. అతడు "తన యింద్రియములకు గల స్వాభావికములగు గతుల నడ్డగించి, పరమేశ్వరు డెల్లయెడల నున్నట్లు చూచును." దృశ్య ప్రపంచమునందలి చమత్కారము లతనిని మోసగింప జాలవు. ఇంద్రియ భోగ్య పదార్థములు, బాహ్యము లయిన యాడంబరములు నతని దృష్టిని కప్పజాలవు. అతడు శాంతచిత్తుడై పరమాత్మని గుర్తింపసాగును. పరమాత్మ డతని దృష్టిలో "అన్నింటిని కదల్చును; తానుమాత్రము కదలడు." కాని, విషయవాసనలలో చిక్కువడి, మనోవికారములకు వశుడైన వానికి పరమేశ్వరుడు మిక్కిలి దూరము. జ్ఞానులకు మాత్ర మతి సమీపస్థు డగును. కారణమేమన: పరమేశ్వరు డన్నింటికి లోపల వెలుపల వ్యాపకుడై యున్నాడు గదా!

ఎవని హృదయమున కృతజ్ఞతాభావము స్థిరమగునో అతనిలో విరోధముకాని, అసంతోషముకాని, సంక్షోభముకాని యుండదు. మాత్స ర్యము, ఘృణ, ఈర్ష్య, తిరస్కారము నను నివి యన్నియు ద్వంద్వభావము యొక్క భిన్నరూపములే యగును. మనుష్యుల యదృష్ట మొక్కటియే యనియు, ప్రతి జీవుడును పరమేశ్వరుని సజాతీయ ప్రభావముచే చేష్టించు ననియు, నీ విశాల బ్రహ్మాండమునందలి ప్రతి పరమాణువును ఒకే శ్వాసవలన జీవనము బొందుచున్న దనియు, ప్రతివాని హృదయమును నభిన్నమైన యాకాశ జ్వాలచే ప్రదీప్త మగుచున్నదనియు గుర్తించు మానవునకు ద్వంద్వభావ మెక్కడనుండి కలుగును? వానికి సమస్త భేదములు నశించును. అతనికి మానవజాతి యంతయు నొక కుటుంబ మగును. జాతిలోనున్న వ్యక్తులందరు నతనికి సోదరు లగుదురు. కాగా వైరభావము, స్పర్ధ, మాత్సర్యము, విరోధము నతనిలో నెట నుండును? ఇట్టి మానసికస్థితిని, చిత్తస్థైర్యమును బొందిన వ్యక్తి "సర్వ భూతములు

పరమేశ్వరునిలో నున్నవి. పరమేశ్వరుడు సర్వభూతములందు వ్యాపకుడై యున్నాడు." అని ఉద్ఘోషించును. అప్పు డతడు "ఏ ప్రాణిని తిరస్కారదృష్టితో జూడ జాలడు. శోకమోహము లతని నంటవు." అతడు తన శుద్ధ బుద్ధితో "సర్వభూతములందును నొకే పరమాత్మ నివసించుచున్నట్లు" చూచును.

మానవుని యనుభవము బ్రహ్మాండము యొక్క బాహ్యరూపమును భేదించుకొని యంతరాత్మవఱకు జేరగలిగిన నా డత డా యంతరాత్మనే పూజించును; ప్రశంసించును; ప్రేమించును; అన్యము నాకాంక్షింపడు.

"సర్వ భూతములందు వ్యాపించి, ఆకారములేనిదై, స్థూలసూక్ష్మ కారణ శరీరములతో బరివేష్టింపక, బుద్ధికి రాజై, స్వయంభువు, పూర్ణము, సర్వజ్ఞము, సర్వవ్యాపకమునై యుండి, సనాతన కాలమునుండి సమస్త ప్రాణులకు దగిన కార్యములను నియమించి పరమదయాళు వగు తండ్రి వంటి పరమేశ్వరుని" కంటె మించి సమ్మానము చేయదగు వస్తువు మానవున కింకొకటి యేమున్నది? అట్టి పరమేశ్వరు నారాధించు వ్యక్తిని జూచినపుడు మన కాశ్చర్య మేల కలుగదు?

పరమేశ్వరు నెఱిగిన జీవులు ధన్యులు. వారి హృదయ మానంద భరితమై యుండును. వారికి జీవనము విలాసమయమగును. వారు స్థిరసుఖ మనుభవింతురు. మృత్యువును జయింతురు. కాని, యిందుకు విపరీతముగ నవిద్యాంధకారమున జిక్కియుండు వారు దుఃఖసాగరమున మునిగి తేలుచుం దురు. బ్రహ్మాండవిధాత నెఱుగని యజ్ఞాను లున్నతి నెట్లు పొందగలరు?

అజ్ఞానమునకు మించిన భయంకర వస్తు వింకొకటి లేదు. మనుజు డొకమాటు తన యజ్ఞానమును గుర్తించునేని దాని నతడు సహింపజాలడు. అందువలననే యజ్ఞానమును గుర్తింపగానే యతనికి జ్ఞాన ముదయింప నారంభించును. బుద్ధిమంతుడైన గ్రీకు తత్వవేత్త సోక్రటీసు చెప్పినదేమి?

"నాకేమియు తెలియదు. అనియే నాకు దెలియును." అనియే కదా? అందు వలననే యాత డాత్మజ్ఞుడు కాగలిగినాడు.

అవిద్యవలననే సమస్త విరోధము లుప్పతిల్లు చున్నవి. దాని భీషణ రూపము నే మనగలము? పతంజలి మహర్షి దీని నెట్లు నిర్వచించినాడో చూడుడు.

"అని త్యాశుచి దుః ఖానాత్మసు, నిత్య శుచి సు ఖాత్మఖ్యాతి రవిద్యా."

మానవు డీ యవిద్య వలన, ఒకటి : వినాశశీలమగు తత్త్వములతో గూడియుండు నీ విశ్వ దృశ్యము లెల్లపుడు నిట్లే యుండునని యెంచును. ఈ స్థూల భౌతికదేహము శాశ్వతమని యెంచును. రెండు : తత్వవేత్తల దృష్టిలో మూకము, వంచకము నగు నారీసౌందర్యమును, అసత్య వ్యాపారము, చౌర్యము మున్నగు భావములతో మలినమైనను వాంఛనీయమగు నుపభోగముగాను, శుచిగాను నెంచును. మూడు : విషయాసక్తుడై, వాని వలన గలుగు తృప్తినే సుఖముగాను, ఆనందముగాను నెంచును. నాలుగు: భౌతికపదార్థములనే - శరీరాదులనే యాత్మగా గుర్తించును. ఇది యంతయు నవిద్యామహిమ. అవిద్యయన విపరీత జ్ఞానము. అది పైన చూపినట్లు చతుర్ముఖమై విలసిల్లును. ఈ అవిద్యా విలసితులకు ఇంద్రియ సుఖములకు మించిన సుఖములేదు. ఐహిక జీవనమునకు మించిన జీవనమును లేదు. "అట్టివారు సుఖము నందజాలరు. వా రవిద్య నుపాసింతురు. అంధకారమున - అజ్ఞానమున బడియుందురు. కాని కేవలము విద్య నుపాసించి గర్వించు వా రంతకంటెను నవిద్యాంధకారమున బడుదురు."

తాను మిక్కిలి జ్ఞానియని యెంచువాడు జ్ఞానికాడు. అట్లు గర్వించు వాని మస్తిష్కమున పుస్తక సమూహ మిమిడియుండును. అతని స్మృతి పథమున శబ్దసమూహమో, వాక్యసమూహమో తక్క వేరేమి యుండును?

అతని జిహ్వాపై నానావిధ పదజాలము తాండవింప గలదు. ఆతని మనో మందిరమున వాగ్వివాదమున కత్యంతోపయుక్తమగు బహువిధ పదజాలము వహించియుండును. ఇంతకుమించి యతనిలోనున్న విశేషమేమి? వాస్తవమున జ్ఞానియైన వాని భావములు, ఆలోచనలు, జీవనము, కర్మములు నన్నియు పవిత్రములై యుండును. జ్ఞానము నిత్యజీవనము; సనాతన సుఖము; సదాశాంతి యగును. అవిద్య దానికి విపరీతమగును. సమస్త దుఃఖము, సమస్త పాపము, సమస్త వ్యాధి, సమస్తానిష్టము అవిద్య యగును. జ్ఞానావిద్యలలోగల పారస్పరిక భేదమునకు మించి ప్రపంచమున మఱియొక భేద మేమున్నది?

''అవిద్య ఐంద్రియిక జీవనము కలిగించు పరిణామ మొకవిధముగ నుండును. విద్య - ఆత్మిక జీవనము వలన కలుగు పరిణామము దానికి విపరీతముగ నుండును.'' అని చెప్పినవారు భ్రాంతులు కారు.

చెడుగునుండి మంచిని, విషమునుండి యమృతమును గ్రహించు వాడు బుద్ధిమంతుడు, జ్ఞాని తన యింద్రియములతో చెడుగు నాచరింపడు. బంధనమునుండి, పాపములనుండి, దుఃఖములనుండి, మృత్యువునుండి తొలిగించు ధార్మిక జీవనము కర్మోపాసన యగును. జ్ఞాని తన యింద్రియములను వశమున నుంచుకొనును. పుణ్యశీలు డగును. ఆతని మానసిక భావము లున్నతములగును. అవిద్యనుండి యతడు ముక్తుడగును. అందు వలన నతనికి చిరస్థాయిగల పరమానందము-అమరత్వము ప్రాప్తించును. అట్టి జ్ఞానిని గూర్చియే యీ క్రింది మాటలు చెప్పబడినవి.

''ఏ మానవుడు విద్యావిద్యలను రెంటిని ననుభవమునకు దెచ్చు కొనునో యాతడు ఐంద్రియిక జీవనమువలన మృత్యువును జయించి, ఆత్మిక జీవనము ద్వారమున నమరత్వమును బొందును.''

లోకమున నవిద్యచే వ్యామోహితులయిన వారు పలువు రున్నారు. అవిద్యవలన రూపొందిన రూపము లతిభయంకరములు. వానిలో వైజ్ఞానిక

నాస్తికత యొకటి. ఈ నాస్తిక్యము పరమాణువులు సర్వశక్తిమంతములని విశ్వసించును. బాహ్య పదార్థాన్వేషణమున తత్పరుడైన వైజ్ఞానికుని మనస్సున ప్రకృతికి, దాని గతికి సంబంధించిన భావనలు నిండియుండును. గతి శాస్త్రము, యంత్ర విద్యావిషయక వివరణములు నతని మనస్సున తాండవించును. అందువలన నతడు యింద్రియముల ప్రామాణ్యము తక్క వేఱు ప్రామాణ్యము నంగీకరింప సమకట్టడు. అతడు అపరిపక్వమైన విశ్లేషణ కార్యము నారంభించును. అతడు జంతువుల శరీరమును,నాడులను, కోశములను మాటిమాటికి ఛేదించి, ఛేదించి సూక్ష్మపరీక్షణలు సేయుచుండును. కాని, అతనికి మస్తిష్కమున నగపడు నానావిధములైన మస్తిష్క భాగములలోగాని, జటిలమైన నాడీసమూహమునందు కాని విజ్ఞుడైన పరమేశ్వరుని చిహ్నములు గానరావు. అంతటను నతనికి గతి, గతిశీలమగు ప్రకృతియే కనిపించును. అతడు తన శరీర శాస్త్రమునకు సంబంధించిన అన్వేషణము జేయదొడగును. అతని యన్వేషణము రాసాయనికమగు నాడులగతివఱకు వచ్చి యట సమాప్తమగును. అతడు ప్రకృతికి సంబంధించిన సేంద్రియ విభాగము (Organic department) ను విడిచి, కఠినములు, తరళములు, బాష్పమయములునగు పదార్థములను ఉష్ణతాపము, విద్యుత్తు, రాసాయనిక పదార్థములు మున్నగు సాధనములతో మాటి మాటికి ఛేదించి, ఛేదించి వేఱుసేయ యత్నించును. కాని, యతని కా పరీక్షణలలో నెల్లయెడల పరమాణువులు, వాని గతి విశేషము, రాసాయనికముగ వానియం దేర్పడు మార్పులు తప్ప మఱియెం దేమియు కనిపింపదు. పరమేశ్వరుని యునికి కట తావేకనిపింపదు అప్పుడతడు ప్రత్యక్షావలోకనమునకు సంబంధించిన సునిశ్చిత సాక్ష్య బలముతో, వ్యక్తిగతమగు ననుభవమనెడి అభ్రాంతవేదిక మీద నిలబడి, జ్ఞానగర్విత శిరస్సును పైకెత్తి, స్నాయువులందు జనించిన ప్రాకృతిక శక్తులతో మేరుదండమును నిగుడించి, విజ్ఞము, సర్వవ్యాపకము, సర్వమునకు గతి నొసంగు తత్త్వమునందు

గల యనిష్ట విశ్వాసమునకు చివరిసారి తిలాంజలి నొసంగును. పరమాణువుల బలముపై నతని కపార విశ్వాసమేర్పడును. వాని నతడు సరళములు, నత్యంత సూక్ష్మములు నగు పదార్థములుగ నెంచును. వాని విశ్లేషణము - పృథక్కరణము అశక్యము అవి సనాతనములు. అస్పష్టములు. వాని గతుల నూహింప నలవికాదు. ఆ గతులు వానికి స్వాభావికములు. అన్య కల్పితములు కావు. పరమాణువుల యస్తిత్వమున కా గతులు ఆవశ్యకములు. అందువలన నవి వానికి స్వాభావికములు. ఇట్టి పరమాణువుల శక్తులకు సంబంధించిన విస్తృత వ్యాపారమున (అవ్యక్త సంచలనమున) విశేష పరమాణువులు పరస్పరము సంయుక్తములగును. అవి తాత్కాలికమైన రచనను గ్రహించి, చేతన - జీవన లక్షణమును ప్రకటించును. అచింతితములు అజ్ఞేయములు నగు నవస్థలవలన నీ బీజము - జీవనము ననుకూలదశలలో వృద్ధిజేయును. ఆ సమయమున జీవన నిమిత్తమగు మహాసంగ్రామము జరుగుచుండును. ఈ సంగ్రామమున ననేక సేంద్రియ ప్రాణులా పరమాణు ప్రళయమున వేనినుండి యవి యుత్పన్నములైనవో వానియందే మరల త్రోయబడును.

ఈ స్థితి నిర్వాణ మనబడును. కాని, కొన్ని సౌభాగ్య శీలములగు సేంద్రియ జీవులు ఉపర్యుక్త మహాసంగ్రామ మనెడి విపత్తునుండి తప్పించుకొని బయటపడి క్రమముగా వృద్ధిజెందును. వాని యింద్రియ విన్యాసమున పరివర్తనము, వికాసము కలుగుటవలన నవీనేంద్రియము లుత్పన్నములగును. తదుపరి వానియందు ఇంకను వృద్ధికలుగును. క్రమముగ మానవ ప్రాణి యావిర్భవించును. వైజ్ఞానికుని దృష్టిలో మానవుడిట్లు జన్మించును. దీనింబట్టి మానవుడు పరమాణువుల యాకస్మిక సంయోగమువలన నేర్పడినట్లు తేలుచున్నది. కావుననే నేటి వైజ్ఞానిక మానవుడు తన తప్తమస్తిష్క సహాయముతో పరమేశ్వరుని, అమరత్వమునకు సంబంధించిన నిర్బల సిద్ధాంతములను బొత్తిగా విడువ నుద్యమించుచున్నాడు.

నేటి బుద్ధిమంతుడైన మనుష్యు డీ యమరత్వాది సిద్ధాంతముల నెట్లు విశ్వసించును ? అందువలననే యతడు "ఓ బ్రహ్మజ్ఞానీ ! ధర్మము పేరిట నీవు చేయు యత్నములు సఫలమెట్లు కాగలవు ?" అని సోపహాసముగ ప్రశ్నించును. "మానవజాతి, జాతిరూపమున దీర్ఘకాలమువఱకు శేషించి యున్నను వ్యక్తిరూపమున మానవుడు ధూళిలో మరల కలిసిపోక తప్పదు. అత డా మట్టి రేణువుల పరిణామమే కదా !" అనును.

నేటి వైజ్ఞానికుని నాస్తికతా రూప మిది. ఆతని కంతయు ననిశ్చితమే; అవిశ్వాస్యమే. జీవనము పరమాణు రూప ప్రబల చక్రసంఘర్షణ వలన జనించినట్టి ఆకస్మికాగ్నికణము మాత్రమైయున్నది. బ్రహ్మాండమున గనిపించు చమత్కారములన్నియు నా పరమాణువుల యంధగతి జనితములే. భావికాలీన శుభాకాంక్షకు తావు లేదు. పీడితులగు పుణ్యాత్ములకు గాని, హతాశులైన న్యాయాభిలాషులకు గాని సాంత్వనము పరకాలమున లభింప జాలదు. వీని స్వాభావిక పరిణామ మే మగును ? మానవుడు సర్వశక్తిమంతములగు పరమాణువుల నుపాసించి, యధర్మము, దురాచారము ననెడి సముద్రమున మునిగి తేలుచు కొంచెమైనను సంకోచింపక న్యాయమును కాలరాచును. సద్గుణముల నణచివేయుచు నొక్క నిట్టూర్పైనను విడువడు. మానవ ప్రకృతియందలి యుత్కర్షను, శ్రేష్ఠతను నాశమొనర్చి వాని స్థానమున సాహసికత యనెడి తత్త్వజ్ఞానమును నిలబెట్ట జూచును. అతడు తా నొనర్చు కర్మములోను, తన భావములందును సాహసికుడగును. లేక యతని తత్త్వజ్ఞానము సమర్పణకు జెందవచ్చును. అది సాహసికముకాని, సమర్పితముకాని, యేదియైనను నిందు మానవీయమాహాత్మ్యముతోబాటు నృశంసములగు నత్యాచార చిహ్నములు గోచరింపక పోవు. మానవు డీ స్థితిలో క్షుబ్ధుడు, అశాంతుడు, ఉదాసీనుడు, ఉద్విగ్నుడు, జడుడు కావలసి వచ్చును. తన్ను దా మఱచిపోవును. ఇట్టి వైజ్ఞానిక నాస్తికతకు చెందిన యంతిమరూపము విపత్తియుతమైనను, దీనికింకొక కోమల మృదురూపము

లేక పోలేదు. అది యొక నిశ్చితము, అత్యున్నతము నగు మృత్యువున కనురూపముగ నుండును. వైజ్ఞానిక నాస్తికుడు నియమములందును, ప్రాకృతిక క్రమమునకు జెందిన పరివర్తన రహిత స్థిరస్వరూపము నందును దృఢమైన విశ్వాసము గలిగియుండును. అతనిలో మూఢ విశ్వాసములకు తావుండదు. కనీస మతడు కార్య జగత్తునకు సంబంధించినంతవఱకు పారంగతు డనదగి యుండును. అతని యాంతరిక జీవన మెంత యశాంతము, క్షుబ్ధము, దుఃఖమయము నైనను, బాహ్యజీవనము మాత్రము పూర్ణముగ సఫలజీవన మనదగి యుండును. కాని, అవిద్యా మూలమున బ్రహ్మాండమును శాసించు పరమేశ్వరుని నెఱుగక, యీ ప్రపంచమునగల పదార్థములందు వర్తించు ప్రాకృతిక నియమములనుగాని, క్రమమునుగాని తెలిసికొనజాలక అంధ విశ్వాసములతో జీవనమును గడుపు మానవుని స్థితియే వేఱు. వాని దుఃఖములకు అంతమే యుండదు. అతడు పార్థివ పదార్థములను, రాళ్ళను. వృక్షములను, మానవ వ్యక్తులను పరమేశ్వరుని స్థానమున బూజించి అధోగతిని బొందును. అట్లే నాస్తికుడును పార్థివ తత్త్వములను, మఱి యితర భౌతికతత్త్వములను ఉపాసించి వానియందే రతుడై యుండును. ఇట్టి నీచము, నపకృష్టమునగు నాస్తిక్యముతో నేటి ప్రపంచము నిండియున్నది. క్రైస్తవుల మనుష్యపూజ, మహమ్మదీయుల స్థానపూజ, హిందువుల విగ్రహపూజ, అనేకేశ్వరవాదము, వేదాంతుల మాయావాదము, మతాభిమానము, సాంప్రదాయిక పక్షపాతము, అసహిష్ణుత మున్నగు చెడుగులతో చరిత్రలు నిండియున్నవి. ఇవి యన్నియు మానవుని పతితావస్థకు నిదర్శనములు; స్థిరమైన ప్రమాణములు. దృశ్యమానములగు జడపదార్థములను బూజించుటవలన గలుగు ననిష్టములను లెక్కింప శక్యము కాదు. అందువలన, "పరమాణువులను ప్రపంచమునకు నిమిత్త కారణమని యెంచి, వానిని పూజించువారు దుఃఖ సాగరమున బడుదురు" అనుట యసత్యము కాదు. అట్లే "ఆ పరమాణువుల

వలన నేర్పడిన దృశ్య స్థూల పదార్థములను బూజించు వారంత కంటె నెక్కుడు దుఃఖముల ననుభవింతు'' రనుటయు సత్యమే. ఇట్లు వైజ్ఞానిక నాస్తిక్యము వలన గలుగు ఫలమునకు, జడపదార్థ పూజ వలన కలుగు ఫలమునకు మధ్య నెంతో భేదముండును. రెండింటి పరిణామ మొక్కటిగ నుండదు. కాని, జ్ఞానియైన వ్యక్తి భౌతిక విజ్ఞానమును దృశ్య పదార్థములను రెండింటిని చక్కగ నుపయోగించుకొని యుచిత లాభము నందును. వాని జీవితము రమ్యమై, శిక్షాప్రదమై, బలవర్ధకమై సుఖములను జేకూర్చును. అతనికి స్థూల దృశ్యపదార్థము లన్నియు ప్రయోజనకరము లగును. సూక్ష్మ పరమాణువులు కూడ నతనిచే సర్వ శక్తిమంతుడైన పరమేశ్వరుని యునికితో పూర్ణములై యాలోకితములగును. పరమేశ్వరు డా పరమాణువులతోనే దృశ్య పదార్థములందు స్థిరశక్తిని, జీవనసంచార మును ప్రవహింపజేయును. ఇట్లు ''సూక్ష్మ స్థూలజగత్తును బాగుగ నెఱిగిన మానవుడు దృశ్యపదార్థముల నుపాసించుటవలన గలుగు మృత్యువును దరించి, పరమాణువులలో బ్రకటమగు దివ్యశక్తి యనుభవమువలన గలుగు నమరత్వము ననుభవించును.''

ఒకవంక పరమేశ్వరు డీ బ్రహ్మాండమునకు నాయకుడు, సర్వవ్యాప కుడు, అతడెల్లరకు న్యాయకారి, ఎల్లరకు వారి వారికి దగినట్లు కార్యములను నియమించువాడు. ఇంకొకట మానవుడు కర్మోద్యుక్తుడు. అతనిలో కార్య శక్తి, ఓజస్వంతమగు క్షమత, సర్వసాధకమగు నుద్యమము మున్నగు గుణములు విలసిల్లుచున్నవి. మానవునిలోని గుణసంపదలు అతని కర్తవ్య కర్మములను నిర్వహించుటకు దగియే యున్నవి. ప్రశస్తము, సుందరము, చిత్తాకర్షకము, హితకరము, సుఖకరము నగు నీ బ్రహ్మాండమును సూక్ష్మ దృష్టితో దిలకించు వాని హృదయము సర్వ శక్తి మంతుడు, దాతలకు దాతయు నగు నా పరమేశ్వరునియెడ కృతజ్ఞతను బ్రకటింపక యెట్లుండ

గలదు ? అంతే కాదు. అతని హృదయమునుండి అప్రయత్నముగ నీ ప్రార్థన వెలువడును.

"ఓ జగత్ప్రతిపాలక ! పరమేశ్వర ! సత్య సూర్యుని ముఖముపై కప్పియున్న సువర్ణమ యావరణము దొలగింతువుగాక ! అందువలన మేము సత్యమును గ్రహించి స్వధర్మమును గుర్తింతుము. ఓ పరమర్షీ ! రక్షక ! శాసక ! సనాతన ప్రకాశ ! నీ కిరణముల నుపసంహరింపుము. నీ పరమానంద పూర్ణ తేజోమయ రూపము ననుభవింప సమర్థుడ నగుదును గాక ! ఇదియే నా హార్దిక ప్రార్థన."

"పరమేశ్వర ! నీచే నొసంగబడు నా యమరజీవన మద్భుతము. నీవుచేయు న్యాయము ఆశ్చర్యకరము. స్థూల శరీరమునుండి యమరసూక్ష్మ శరీరమును సృష్టించు నీ రీతి యెంత శ్రేష్ఠమైనది ! నీవు మమ్ములను మరణానంతరము వసింపజేయు లోకము ఇహమున మేము చేసిన కర్మములనెడి విత్తనముల వలన నుత్పన్నమైనదే కదా !"

"ఓ జ్ఞాన స్వరూప ! నీవు జ్ఞానమునకు స్రోతస్సువు. మాలో నీ జ్ఞానమును నింపుము. న్యాయపరుల మగునట్లు మమ్మనుగ్రహింపుము. మాలోని దుర్గుణముల నన్నింటిని దూర మొనర్చుము. మేము మాటి మాటికి నిన్ను స్తుతియింతుము; ఉపాసింతుము.

ఓమ్ తత్ సత్